# అస్త్ర చికిత్స

రాబోయే తన తొలి వసంతాన
చిగురాకుకూ, తెలి మబ్బుకూ షటిలింగ్ చేయాలని స్వప్నిస్తోన్న
రెక్కలు మొలవని పక్షికూన కళ్ళు విప్పేసరికి -
ఆకొన్న పాము కోతే గూట్లో కాన వస్తుంది.
తన కూన కడుపుకోసం చెట్టూ, పుట్టా గాలించి
నాలుగు చెద పురుగుల్ని వేటాడు కొచ్చిన తల్లి పక్షికి
లేత ఈకల శిథిలాలే స్వాగతం చెబుతాయి.
విశేషమేం లేదు.
కన్ను చెమ్మగిల్లాల్సిన విషాదమేం కాదు,
ఖడ్గధారణ చేసి ఖండించాల్సిన అన్యాయమేం లేదు !
ప్రాకృతిక న్యాయస్థానంలో ఫిర్యాదుకు చోటే లేదు !
కానీ,
ఇక్కడ మనుషుల మధ్యే వీడు -
ముసుగులో నర మేధం సాగించి,
ఆ శవాలతో శిలువను వేసి
ముసుగు తొలగించి ఆ శిలువకే మొక్కుతున్నా -
అదే 'సంస్కృతి' అని దండోరా వేయిస్తున్నాడు
మంది దప్పికి తన మోచేతి నీళ్ళే 'మంద'ంటున్నాడు.
అసలు తన మోచేయే
జలాశయాల జన్మస్థానమని దుష్ప్రచార భేరి మోగిస్తున్నాడు.
చారిత్రక గాయాల మీద అబద్ధాల బాక్టీరియాను పట్టీగా వేసి,
'అదే వైద్యం: నమ్మ'మంటున్నాడు.
కోటి నిర్దోష స్వప్నాలు నిలువునా నెత్తుటి మడుగులో మునిగిన
తన లాభం గ్రాఫ్ లైన్ దౌడు తీసి, పైకెగబాకితే చాలు -
'ఏ యుద్ధమైనా న్యాయ బద్ధమే' నంటాడు వాడు !
భూమి మరుభూమికి మారుపేరైనా వాడికి చింతలేదు,
తన స్వార్థ విషవృక్షం చిగురిస్తే చాలు వాడికి !
వాడే అలా అంటున్నప్పుడు వాడి మీద వేరే ఫిర్యాదెందుకు ?
మనం మనుషులం, సమతా స్వప్న కిరీటధారులం !
సత్యపథంలో అలసట ఎరుగని బాటసారులం !
అస్త్ర చికిత్స తప్ప గత్యంతరం లేదు ! తప్పదు మరి,
రక్త కొలనులో తప్ప శాంతి కలువ జన్మించదు !




సంపుటి : 16    సంచిక : 2

డిసెంబర్ 1992

రచనలు పంపవలసిన చిరునామా :

**నిర్మలానంద,**
వర్కింగ్ ఎడిటర్,
29-28-67, దాసరివారివీధి,
సూర్యారావుపేట,
విజయవాడ - 520 002.

**మేనేజర్, ప్రజాసాహితి,**
29-28-67, దాసరివారి వీధి,
సూర్యారావు పేట,
విజయవాడ-520 002.

ఏజంట్లు, చందాదారులు
వ్రాయవలసిన అడ్రస్,
ఇతర వివరాలకు :

**కొత్తపల్లి రవిబాబు,**
ప్రధాన కార్యదర్శి
జనసాహితి, నగరం-522 268.




కుట్రపన్ని

పాశవికంగా

హత్యచేసి....



వెల : రూ. 5    సం॥ చందా రూ. 50

ప్రత్యేక సం॥ చందా రు. 100

## ఈ సంచికలో ...

## సంపాదకీయం

# పడగ విప్పిన ఫాసిజం !

హిందూ మతోన్మాదం ముసుగులో అగ్రవర్ణ దోపిడీ పాలక వర్గ శక్తులు తమ చర్యల యొక్క విష స్వభావాన్ని డిసెంబరు 6న నగ్నంగా బయట పెట్టుకున్నాయి. భిన్న సాంస్కృతిక, మత, సాంప్రదాయాలలో జీవించే ప్రజల మధ్య గల శాంతి సామరస్యాలను భగ్నం చేశాయి. 463 సంవత్సరాల నాటి బాబ్రీ మసీదుని నేలమట్టం చేసి, మత విద్వేష రాజకీయాలకు మానవ నాగరికతనే యజ్ఞ పశువుగా మార్చే శాయి.

భారతదేశం సెక్యులర్, ప్రజాస్వామ్య దేశంగా పాలకులు చెప్పేదంతా వట్టి బూటకమని పై సంఘటన ద్వారా మరొకసారి రుజువయింది. 10 రోజుల్లోనే దేశ వ్యాపితంగా 1500 మంది ప్రజల ప్రాణాలు ఆహుతయి పోయాయి. పాలక వర్గాల 'శాంతి కాముకత్వం ప్రచారానికే తప్ప ఆచరణకు కాదన్నది తేలిపోయింది.

బి. జె. పి, ఆర్. ఎస్. ఎస్, విశ్వహిందూ పరిషత్ భజరంగ్‌దళ్, శివసేన తదితర సంస్థల ముసుగులో ఫాసిజం తలెత్తుతున్నట్టు కనిపిస్తున్నా 45 సం॥ల కాంగ్రెసు పాలన వారి వ్యాప్తికి నీరు పోసింది. తరతరాల వర్ణ వ్యవస్థ, దాని తాలూకు బ్రాహ్మణ సంస్కృతి దానికి పంట భూమిలా తోడ్పడింది. బ్రిటిషు సామ్రాజ్యవాదులు రగిలించి వెళ్ళిన చిచ్చుకు భారత పాలక వర్గాలూ, గ్రూపులూ, రాజకీయ పార్టీలు సమయోచితంగా ఎగదోస్తూ ప్రజల హృదయాలలో ఆరనిమంట రేపారు. ప్రజా ఉద్యమాలను పక్కదారి పట్టించడానికీ, మత కలహాల సాకుతో ప్రజలపై అణచివేతని పెంచడానికీ వినియోగించుకుంటున్నారు.

దేశీయ, విదేశీయ పత్రికా విలేఖరులూ, ఫోటోగ్రాఫర్లపై దాడులు, మహిళా విలేఖరులను క్రూరంగా అవమానించడాలూ, సూరత్ లాంటి పట్టణాల్లో అత్యాచారాలూ, వాటిని వీడియో షూటింగ్ చేయటాలూ. మతోన్మాదుల యొక్క ఆచరణకు అద్దం పట్టే అంశాలుగా బహిర్గతమైనాయి.

I

"హిందూ" అన్న పదం వేదాలలో, ఉపనిషత్తులలో, పురాణాలలో లభించదు. సుమారు వెయ్యి సంవత్సరాల క్రితం తురుష్కులు తమ వైపు నుండి చూస్తే సింధు నదికి ఆవల నున్న ప్రాంతాన్ని హిందూ దేశంగా భావించారు. బాబర్ తన స్మృతుల్లో హిందూస్తాన్ అన్న పేరుని అనేక సార్లు రాసుకున్నాడు. తన కొడుకు హుమాయూ

న్ కి స్థానికులతో (హిందూవులతో) సఖ్యంగా వుండమనీ, గో మాంస భక్షణ విసర్జించమనీ బోధించాడు.

తురుష్కులు వచ్చేసరికే ఇక్కడ అనేక మత విశ్వాసాలు నెలకొనివున్నాయి. హిందూ వర్ణ వ్యవస్థ కున్న 'సజాతీయత' (Homogenity) మతానికి ఎన్నడూ లేదు. ఇక్కడ పుట్టిన భిన్నతాత్విక భావాలేగానీ, ఇతర ప్రాంతాల నుండి వచ్చినవే కానీ కాలక్రమంలో వర్ణ వ్యవస్థకు ఒరిగిపోయాయి. దానికి వ్యతిరేకంగా గట్టి ప్రతిఘటన నిచ్చిన బౌద్ధం క్రూరమైన అణచివేతకి గురయింది. నిరీశ్వర భౌతిక వాదాన్ని ప్రచారం చేసిన చార్వాకులు ఈ గడ్డమీద పుట్టి పెరిగిన వారే. విశాలార్థంలో చెప్పాలంటే హిందూ మతం నిరీశ్వర వాదం నుండి అనాత్మభావం దాకా, ఏకేశ్వరోపాసన నుండి ముక్కోటి దేవతల పూజ దాకా గల తాత్విక భావజాలాలన్నిటి యొక్క కలగలుపుగా రూపొందింది. బ్రాహ్మణ క్షత్రియ ఆధిపత్య దురహంకార సంస్కృతి అధికారమతంగా సాగుతూ వచ్చింది. దీనికి వ్యతిరేకంగా విభిన్న చారిత్రక కాలాల్లో దేవుని పేరుతో కూడా నూతన తాత్విక సిద్ధాంత ప్రతిపాదనలు వచ్చాయి.

అందుకే హిందూ మతం అనే పేరుతో కాక వైదిక, బౌద్ధ, చార్వాక, అద్వైత, ద్వైత, విశిష్టాద్వైత, శైవ, వైష్ణవ, బ్రహ్మ సమాజ తదితర రూపాలలో, నామాలతో మతాలు, పీఠాలు ఆవిర్భవించాయి. కాలక్రమంలో భారతీయ ఫ్యూడల్ వ్యవస్థ యొక్క సాంఘిక రూపమైన వర్ణ కులవ్యవస్థతో అవి సర్దుబాటు చేసుకున్నాయి.

విగ్రహారాధనను వ్యతిరేకించిన ఇస్లాం హైందవంతో పోలిస్తే సాంఘిక సమానత్వాన్ని పాటించే మతంగా భావించవచ్చు. ఒకే దేవుడు, ఒకే గ్రంథం ప్రాతిపదిక మీద, మానవులందరూ దేవుని దృష్టిలో సమానులే అన్న సూత్రం మీది ఆధిఅన్య సాంస్కృతిక జీవనంలోని వారిని ఆకట్టుకుంది. సుదీర్ఘ కాల రాజకీయాధికారం అందుకు దోహదపడింది. మౌఢ్యమూ, అభివృద్ధి నిరోధకత్వమూ వుండినా ఇస్లాం హిందూ అగ్రవర్ణ ఆధిపత్య సంస్కృతికి ఒదగలేదు. సహజీవనం నెరుపుతూ కూడా, స్వతంత్ర ప్రవాహంగా నిలదొక్కుకోగలిగింది. కనుకనే ఇస్లాం పట్ల ఈర్ష్యాద్వేష భావం అగ్రవర్ణ సంస్కృతిలో భాగంగా అంతర్లీనంగా సాగుతూ వచ్చింది. ముస్లిములు 'భారతీయం' కాలేదని బి.జె.పి. వాళ్ళు చేసే ప్రచారం వెనుక గల రహస్యం యిదే. వారి దృష్టిలో భారతీయ సంస్కృతి అంటేనే హిందూ సంస్కృతి అదే బ్రాహ్మణాధిపత్య వర్ణ వ్యవస్థ పునాదిగాగల ఫ్యూడల్ సంస్కృతి.

## II

బ్రిటిషు సామ్రాజ్యవాదులు హిందూ - ముస్లిం పాలక గ్రూపుల మధ్య గల వైరుధ్యాలను చాలా తెలివిగా వినియోగించుకున్నారు. తాము ప్రవేశించేసరికి ముస్లిం పరిపాలన సాగుతోంది కనుక, మెజారిటీ ప్రజానీకంగా వున్న హిందువుల

ఈతి బాధలకన్నింటికీ ముస్లిములే కారకులనే భావాన్ని వ్యాప్తి చేశారు. 'రాజ్యా'ని (State) కుండే అణచివేత స్వభావ ఫలితంగా జరిగిన దురాగతాలన్నిటికీ మతం రంగు నిచ్చారు. చరిత్రకు మత పరమైన విశ్లేషణలిచ్చి ముస్లిం పరిపాలనాకాలాన్ని అంధ యుగంగా నిర్ధారించారు. ప్రథమ భారత స్వాతంత్ర్య పోరాటానికి ముందు (1855లో) అయోధ్యలోని హిందూ మహంతులకి మద్దతునిచ్చి బాబ్రీ మసీదు వివాదాన్ని రెచ్చగొట్టారు. మసీదుకి సమీపంలో రాముని జన్మస్థానంగా ఎత్తైన అరుగుని (రామ్ గుబ్రా) ఏర్పాటు చేయించారు.

భారతీయులలో బ్రిటిషు సామ్రాజ్యవాద వ్యతిరేక చైతన్యం, పోరాటం వ్యాప్తి చెందగా కలవరపాటుతో బెంగాల్ విభజన చేసి భంగపడ్డారు. తర్వాత తమ అనుచర జమీందార్ల నాయకత్వాన 'ముస్లింలీగ్'ని 'హిందూ మహాసభ'ని ఏర్పాటు చేయించారు. దేశభక్తిలో తమకు మించిన వారెవరూ లేరని డబ్బా వాయించుకునే ఆర్. ఎస్. ఎస్. బ్రిటీషు సామ్రాజ్యవాదుల పరిపాలనా కాలంలో ఒక్కసారి కూడా నిషేధానికి గురికాలేదన్న నగ్నసత్యం వెలుగులో దీన్ని పరిశీలించాలి.

బ్రిటీషుసామ్రాజ్య వాదాన్ని ఓడించిన తర్వాత రాజ్యాధికారం ఏ ఏ వర్గాలు, మతాలు, కులాల చేతుల్లోకి రావాలన్నది మౌలిక ప్రశ్న. దానికి ఆయా సంస్థలిచ్చుకున్న జవాబులు, వాటిని అమలు చేసుకోవడానికి జరుగుతున్న సంఘర్షణలో భాగమే ఈ శతాబ్దపు భారత చరిత్రంతా. హిందువులతో పోల్చుకుంటే సంఖ్యరీత్యా ముస్లిములు మైనారిటీయేకాక ఆర్థిక, పారిశ్రామిక రంగాల్లోనూ, విద్యా ఉన్నత ఉద్యోగాలలోనూ బాగా వెనకబడి వున్నారు. ఆర్థిక, సాంఘిక స్థాయిని బట్టి రాజ్యాధికారంలో వాటా లభించటం వర్గ సమాజ లక్షణం కనుక ముస్లిములకు తగిన రాజకీయ ప్రాతినిధ్యం లభించకుండా చేస్తారేమో నన్న భయం సహజంగానే కలిగింది. జాతీయ స్వాతంత్ర్యం అంటే ప్రాచీన హిందూ సంస్కృతి పునరుద్ధరణేనన్న భావం కలిగించే ఉద్యమాలు ఆవిర్భవించాయి. "రామ రాజ్య స్థాపన" అన్న గాంధీ పిలుపు హిందూ కులాల్లోని దళితులకు కూడా అనుమానం పెంపొందించాయి. ఎన్నో గిరిజన రైతాంగ పోరాటాలు జరిగినా అవి సంఘటితోద్యమంగా అభివృద్ధి కాలేదు.

ఆటువంటి రోజుల్లో "ఒక చేతి కత్తితో బ్రిటీషు వారిని మరొక చేతికత్తితో ముస్లిములను తరిమికొట్టా"లనే నినాదంతో దామోదర్ సావార్కర్ లాంటివారు 'హిందూ మహాసభ' ఆశయంగా ప్రకటించారు.

"సాధ్యమైనంత ఎక్కువ అపనమ్మకంతోనే మైనారిటీ ముస్లిముల యొక్క చర్యలను గమనించాలి." అని తన "హిందూత్వ" గ్రంథంలో రాశాడు. దీనినే ఆర్. యస్. యస్. అధినేత గొల్వాల్కర్ 19_9లో మరింత స్పష్టంగా చెప్పాడు. "హిందూస్తాన్‌లో గల విదేశీ జాతులవారు హిందూ సంస్కృతిని, భాషను, మతాన్ని గౌరవించాలి. వారు హిందూ జాతిలో కలసిపోవాలి లేదా హిందూ జాతికి పూర్తిగా

[illegible] యింకా అన్య మతస్తులు లొంగకపోతే ఏమి చేయాలనే ప్రశ్నకు ఆయన జవాబు. "జాతి పవిత్రతను సంస్కృతిని కాపాడేందుకు సమైక్య జర్మనీ, ప్రపంచాన్ని దిగ్భ్రాంతి పరిచే విధంగా యూదులను తుడిచి పెట్టింది. హిందూస్థాన్‌లోని మనం, నేర్చుకొని ఉపయోగించవలసిన చక్కటి పాఠమిది."

హిందూ అగ్ర వర్ణ దోపిడీ వర్గాలకు శూద్ర, నిమ్న వర్ణాలవలె ముస్లిములు లొంగిపడి వుండకపోతే నాజీ ఫాసిస్టుల్లా భౌతిక నిర్మూలనకు పూనుకోవాలనేదే ఆర్. ఎస్ ఎస్; బి. జె. పి. ల ఉద్దేశ్యంగా మనకు స్పష్టమవుతోంది. మైనారిటీ మత తత్వం మరింత పేట్రేగటానికే దోహదపడింది. దేశ విభజన కాలంలో చెలరేగిన మత కలహాలలో వేలాదిమంది ప్రాణాలు కొల్పోవటం, లక్షలాది కుటుంబాలు నిర్వాసితులు కావటం చరిత్రలో జరిగిన వొక విషాద ఘట్టం.

పై ఉన్మాద వాతావరణ కాలంలోనే 1949 డిసెంబరు 22 అర్ధరాత్రి బాబ్రీ మసీదు తాళాలు పగులగొట్టి లోపల సీతారాముల విగ్రహాలను దౌర్జన్యంగా ప్రతిష్టించి అదే రామ జన్మభూమి యని వాదన మొదలు పెట్టారు. 1855 నుండి 1949 దాకా మసీదు వెలుపల గల రామ్ చబుత్రానే జన్మభూమిగా పూజలు పునస్కారాలు చేపట్టిన సంగతి ఎరుగని వారిలా ప్రవర్తిస్తున్నారు. వివాదం కాని దానిని వివాదం చేసి, ఈనాడు తమ గణాచార బృందాలు పడగొట్టింది మసీదే కాదని అల్లరి చేస్తున్నారు. అయితే దేవాలయాన్ని పడగొట్టారా? ప్రతిపక్ష నాయకునిగా అద్వానీ, ముఖ్యమంత్రి పదవికి కల్యాణ్ సింగ్ రాజీనామాలు చేసింది రామాలయాన్ని పడగొట్టి నందుకా ?

## III

ఆర్. ఎస్. ఎస్. వారికి ఆదర్శనీయమైన హిట్లర్ తరహా జర్మన్ ఫాసిజం యూదులను, ప్రజాస్వామ్య వాదులను, పొరుగు దేశ ప్రజలను కోట్లాది మందిని బలి తీసుకుంది. ప్రపంచ వ్యాపితంగా అసహ్యించుకోబడింది. ఇటీవల తిరిగి తలెత్తి జర్మనీలోని భారతీయులపై, ఆఫ్రికన్లు తదితర జాతీయులపై భౌతిక దాడులను చేస్తోంది. తమ దేశంలో అన్య జాతీయులుండరాదని ఆర్యజాతి దురహంకారాన్ని ప్రదర్శిస్తోంది. బి.జె.పి. వారు దాన్ని సమర్థిస్తారా ?

జాత్యహంకా -నికి గురయిన యూదులు అమెరికా - బ్రిటన్ సామ్రాజ్య వాదుల సహకారంతో పాలస్తీనా దేశంలో ఒక భాగాన్ని - ఇజ్రాయిల్ దేశంగా ఏర్పాటు చేసుకున్నారు. స్థానిక అరబ్బుల్ని హింసించి, పీడించి జాతి నిర్మూలనా యుద్ధానికి పాల్పడ్డారు. ప్రపంచ ప్రజలందరిచేతా అసహ్యించుకోబడేలా ప్రవర్తిస్తూ పాలస్తీనీయుల్ని మాతృభూమి లేనివారుగా మార్చేస్తున్నారు. జీసస్ సంచరించిన గడ్డ మీద ఈ నిమిషంలో 461 మంది పాలస్తీనీయులు అత్యంత దయనీయంగా

నిరాశ్రయులై, నిలబడే చోటు లేకుండా వున్నారు. జర్మనీలో యూదులకు వ్యతిరేకంగా నాజీ దురహంకారాన్ని సమర్థించిన పాలస్తీనీయులపై ఇజ్రేలీ యూదులు జరుపుతున్న జాతి నిర్మూలనా చర్యలను కూడా సమర్థిస్తున్నారు. దక్షిణాఫ్రికా శ్వేత జాతి దురహంకారులకు వెనుక దన్నుగా వుంటున్న అమెరికా, బ్రిటీషు సామ్రాజ్య వాదుల అంతర్జాతీయ పెత్తందారీ స్వభావాన్ని వీరెన్నడూ విమర్శించరు.

ఒక్క మాటలో చెప్పాలంటే జాత్యహంకార పెత్తందారీ తత్వాన్ని బలపరచటం, అమలుపరచటం వీరి విధానం.

చరిత్రలో జరిగిన దోషాలను సరిదిద్దుతున్నట్లు ప్రకటించుకునే వీరు వర్ణ వ్యవస్థ వికృత సంస్కృతి ఫలితంగా అత్యధిక శ్రామిక, శూద్ర దళిత జనావళి ఎన్ని విధాల దోపిడికి, పీడనకి గురయ్యారో ఒక్కసారి కూడా చెప్పరు. అగ్ర వర్ణ కుటుంబాలలోనే ఎన్ని లక్షలమంది మహిళలు సహగమన దురాచారానికి బలయిపోయారో, అందుకు బాధ్యులెవరో, వారి నీనాడు ఎలా శిక్షిస్తారో .... జరిగిన దురాగతాన్ని ఎలా సరిదిద్దుతారో వీరు నోరు విప్పుతారా ?

గత చరిత్రలో జరిగిన దోషాలన్నింటికీ బౌద్ధ, జైన మతాలూ, ముస్లిములూ, ఈనాటి సమస్యలకు సెక్యులరిజం కారణమనీ వీరు ప్రచారం చేయటం వెనుక తరతరాలుగా, హిందూ చాతుర్వర్ణ వ్యవస్థ, అంటరానితనం యొక్క మహా పర్వతమంత పాపాన్ని ప్రజలకు తెలియనివ్వకుండా దాచి పెడుతున్నారు. తమ అగ్ర వర్ణ పెత్తనం కిందికి ఈనాటికి కూడా రాని ముస్లిములను మొదటి లక్ష్యంగా ఎంచుకుని మొత్తం సమాజంపై వర్ణ, కుల దురహంకార ఫాసిస్టు వ్యవస్థను నెలకొల్పటమే వారి లక్ష్యం.

అందుకే తగతరాలుగా పీడింపబడిన వెనకబడిన నిమ్న వర్ణాలకు స్వల్పమైన సౌకర్యాలు కలుగజేసే మండల్ కమీషన్ రిపోర్టుని అమలు పరచమని సుప్రీంకోర్టు తీర్పు చెప్పగానే బాబ్రీ మసీదుని కూల్చి రక్తపాతాన్ని సృష్టించారు.

వేలాది సంవత్సరాల దోపిడీ, పీడనల సామాజిక విధానాల ఫలితంగా అత్యధిక జనావళి "జ్ఞానాంగ వైకల్యం" పొందిన వారిలా విడిచివేయబడితే వారిని అభివృద్ధి పథంలోకి తీసుకురావటానికి కల్పించే కొద్దిపాటి రిజర్వేషన్ సౌకర్యాలను కూడా వీరు భరించలేకపోతున్నారంటే సామాజిక సమానత్వ ప్రజాస్వామిక భావనకు వీరెంత దూరంగా వున్నారో అర్థమవుతుంది. సెక్యులరిజమనే పదమే వారికి గంగవెర్రు లెత్తిస్తుంటే వర్గ రహిత సమాజమూ, సోషలిజమూ వారికి చెవికి సోకటానికి కూడా వీల్లేదన్నమాట !

## IV

బి.జె.పి. వాళ్ళు చేసే ఆరోపణలో ఒకే ఒక్క నిజం వుంది. అది కాంగ్రెసు వాదులు దొంగ సెక్యులరిస్టులన్నది! బి.జె.పి. వారు హిందూ మతోన్మాదాన్ని,

అగ్ర వర్ణ, కుల దురహంకారాన్ని మాత్రమే రెచ్చగొట్టగలిగితే కాంగ్రెసువారు దేశం లోని సమస్త మతతత్వాలనూ, ప్రాంతీయ. కుల విద్వేషాలను రెచ్చగొట్ట గలుగు తున్నారు.

ప్రత్యేక తెలంగాణా, ఆంధ్రా ఉద్యమాలు వారి పుణ్యమే! అకురాడీలాంటి బింద్రన్‌వాలేను సిక్కు మత నాయకునిగా రూపొందించిందీ, స్వర్ణ దేవాలయంపై మిలిటరీ చర్య జరిపించిందీ, ఇందిరాగాంధీ హత్య తర్వాత నాలుగువేలకు పైగా అమాయక సిక్కు ప్రజలను ఊచకోత కోయించిందీ కాంగ్రెసు వారే!!

షాబానో కేసులో ముస్లిం మతతత్వవాదులకు లొంగిపోయి ముస్లిం మహిళల ప్రయోజనాలకు విరుద్ధంగా పార్లమెంటులో బిల్లు చేయించిన రాజీవ్‌గాంధీ, 1-2-1986న బాబ్రీ మసీదుని తెరిపించి ముస్లింలకు ప్రవేశం లేకుండాను, హిందువులు ప్రార్థన చేసుకునే అవకాశాల్ని కల్పించాడు. అస్సాంలో బోడోలను, తమిళనాడులో వన్నియార్లని, ఆంధ్రాలో తెలుగుదేశం పాలనకు వ్యతిరేకంగా రెడ్లనూ, కావులనూ రెచ్చగొట్టింది కాంగ్రెసు పార్టీయే :

రాజ్యానికీ, పరిపాలనకీ మత ప్రమేయం లేకుండా చూడటం, రాజకీయాలకీ మతానికీ సంబంధం లేకుండా చేయటం, తరతరాలుగా ప్రజల్లో వ్యాపించివున్న మూఢ విశ్వాసాలను తొలగించి శాస్త్రీయ జ్ఞానాన్ని అందించటం మొదలైన చర్యలు తీసుకోకుండా సెక్యులరిజాన్ని నెలకొననేలేదు. దీనికీ భిన్నంగా అన్ని మత మౌఢ్యాలను వ్యాప్తి చెందేటట్టుగా పాఠ్యగ్రంథాలూ, ప్రసారసాధనాలూ రూపొందించారు.

విలువల, రాజకీయ సిద్ధాంతాల ప్రాతిపదిక మేరకాక కుల, మత, ప్రాంతీయ తత్వాలూ, డబ్బు, సారా, గుండాయిజాలతో ఎన్నికలలో గెలిచేవారు సెక్యులర్, ప్రజాస్వామ్య విధానాల కోసం ప్రయత్నం చేస్తారని భావించటమంటే కుక్కతోక పట్టుకుని గోదావరి దాటడమే. పార్లమెంటరీ రాజకీయ పార్టీలన్నీ తరతమ భేదాలతో, శక్తిమేరకు పై చర్యలు చేపడుతున్నాయి. వాటిలో కాంగ్రెసు ఆధిక్యతలో వుంది.

మతోన్మాదమే ఊపిరిగా, రామనామమే ఢిల్లీ అధికార పీఠాన్నధిరోహించటానికి పెద్ద దిక్కుగా ఎంచుకుని, రక్త హారతులతో, మానవ మాంస నైవేద్యాలతో నిత్యకరసేవ సాగిస్తున్న బి.జె.పి. తదితర సంస్థలను ప్రధాని పి.వి. నమ్మాడట! అయిన వారు మోస వుచ్చారట ! వారితో నిరంతరం బుజ్జగింపు రాజకీయలాడుతూ, మసీదుని కూలదోసే పథకంలో వున్నారని తెలిసీ, కరసేవకులందర్నీ ఏ సెక్యులరిజాన్ని కాపాడటానికి ?

దోషుల స్థానంలోనే వుంచవలసిన వారిపై బర్తరఫ్‌లు నిషేధాలూ ప్రకటించి హక్కులు నిరాకరింపబడిన "పీడితులు"గా మార్చి ప్రజలసానుభూతిని పొందటానికి అవకాశం యివ్వటం కాదా ? పి.వి. ప్రభుత్వానికి జరుగబోయేది తెలుసు. కావాలనే

# దోపిడి వ్యవస్థా, అగ్రవర్ణ సంస్కృతిపై పోరాడండి!

—దివి కుమార్

"రాజుగారి కిరీటంలో పొదిగిన ప్రతి ఆణిముత్యమూ, పేదరైతు చెమర్చిన కన్నుల నుండి రాలి పడిన నెత్తుటి గడ్డే!" —అమీర్ ఖుస్రూ

200 సంవత్సరాల క్రితం ఫ్రాన్స్ దేశంలోని రైతులూ, చేతివృత్తులవారూ, పారిశ్రామిక యజమానులూ, కార్మికులూ కలిసి ఆనాటి ఫ్యూడల్ రాచరిక పరిపాలనకు వ్యతిరేకంగా పెద్ద ఎత్తున తిరుగుబాటు చేశారు. భూస్వాముల్ని, ఫ్యూడల్ ప్రభువర్గాలనూ, వారి యొక్క వంశ పారంపర్య రాచరిక పరిపాలనా వ్యవస్థనూ అంతం చేశారు. స్వేచ్ఛా, స్వాతంత్ర్యమూ, సౌభ్రాతృత్వమూ నినాదాలుగా సాగిన, విజయవంతమైన ఈ ప్రజా వెల్లువనే ఫ్రెంచ్ విప్లవం అన్నారు. ఈ విప్లవం సాధించిన అతి ముఖ్యమైన విజయాలేమంటే భూస్వాముల ఎస్టేట్లను రైతాంగానికి పంపిణీ చేయటం. దానితోపాటు రాజకీయ వారసత్వాన్ని రద్దుచేసి సార్వజనీన ఓటింగు హక్కుగల ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పటం. దీనినే బూర్జువా ప్రజాస్వామిక విప్లవం అన్నారు అంతకు ముందుదాకా రాజకీయాలపై గల మతా(చర్చి)ధిపత్యాన్ని రద్దు చేసి, మతానికీ రాజ్యానికీ సంబంధాన్ని పూర్తిగా తెగతెంపులు చేయటం ఈ విప్లవం సాధించిన మరొక విజయం. పారిశ్రామిక అభివృద్ధికి సంకెళ్ళగా మారిన ఫ్యూడల్ రాచరిక వ్యవస్థను రద్దుచేసి, మతానికి అతీతంగా రాజకీయాలూ, రాజ్యమూ వుండే బూర్జువా ప్రజాస్వామ్యాన్ని ప్రపంచమందరికీ ఆదర్శంగా నిలబెట్టారు. పెట్టుబడిదారీ నాగరికతా, సంస్కృతి నలు దిశలా వ్యాపించి ప్రపంచంలో అనేక దేశాలు ఫ్యూడల్ దోపిడీ పీడనల నుండి విముక్తి కావటానికి ప్రేరణ నిచ్చిందా విప్లవం. ఈ విప్లవానంతరం నూతనంగా అభివృద్ధి చెందిన రాజనీతులలో సెక్యులరిజం ఒకటి. అంటే మత ప్రమేయంలేని రాజ్యం (స్టేట్) ఏర్పరచటమన్నమాట.

మొదటి ప్రపంచ యుద్ధకాలంలో (1917లో) లెనిన్ నాయకత్వాన రష్యాలో జరిగిన విప్లవం భూస్వామ్య, పెట్టుబడిదారీ శక్తులు రెంటినీ ఓడించి కార్మిక-కర్షక రాజ్యాన్ని స్థాపించటం జరిగింది. రాజకీయాధికారం మరింత వికేంద్రీకృతమై అత్యధికులుగా వుండే కార్మికుల, కర్షకుల నిర్ణయాలకు ప్రాధాన్యత ఇవ్వబడింది. వారసత్వపు హక్కును తొలగించటం రాజకీయరంగానికి పరిమితం కానివ్వకుండా, ఆర్థిక వ్యవస్థకు కూడా అన్వయించి వ్యక్తిగత ఆస్తులనూ, ఆర్థిక వారసత్వపు హక్కులను తొలగించి సోషలిస్టు ఉత్పత్తి విధానాన్నీ, రాజకీయాలనూ అమలులోకి తెచ్చింది. ఫ్రెంచ్ విప్లవం కంటె మరెంత వేగంగా, తీవ్రంగా రష్యావిప్లవ ప్రభావం ప్రపంచ దేశాలపై ప్రసరించింది.

భారతదేశంలోని సామాన్య ప్రజానీకం సోషలిజాన్ని మనసారా కోరుకుంటు

న్నారు అన్న నగ్నసత్యానికి రుజువేమంటే సోషలిజానికి బద్ధశత్రువులు కూడా ఈనాడు ప్రజలను మోసపుచ్చడానికి "సోషలిస్టు" పోజ్ పెట్టుకోక తప్పని పరిస్థితి ఏర్పడటం.

ఫ్యూడల్ రాచరికాన్ని ఓడించి, బూర్జువా ప్రజాస్వామిక విధానాలూ, దాని నుండి సోషలిస్టు కార్మిక-కర్షక రాజ్యమూ ఈదిశగా గత 200 సంవత్సరాలుగా చారిత్రక పరిణామం జరుగుతోంది. ప్రపంచ వ్యాపితంగా ప్రజానీకం వీటిని సాధించుకోవటానికై అనేకరూపాల్లో దోపిడీ, పీడక శక్తులకు వ్యతిరేకంగా పోరాటాలు సాగిస్తున్నారు.

ఈ పోరాటాలే పాత సమాజం నుండి నూతన సమాజ ఆవిర్భావానికి హామీనిచ్చేది.

## మనదేశంలో సెక్యులరిజం-ప్రజాస్వామ్యం నెలకొన్నాయా ?

మన దేశంలో ఫ్యూడల్ రాచరికాలకు వ్యతిరేకంగా రైతాంగం తదితర ప్రజానీకం పోరాడి ప్రజాస్వామ్యం స్థాపించు కోలేదు. బయటనుండి వచ్చిన మరో వ్యవస్థ (పెట్టుబడిదారీ) ప్రతినిధులైన బ్రిటీషు సామ్రాజ్యవాదులు భూస్వామ్య విధానాన్ని సంస్కరించారు. కానీ రూపుమాపలేదు.

బ్రిటీషు వాడికి వ్యతిరేకంగా సాగిన స్వాతంత్రోద్యమానికి ఫ్యూడల్ రాచరిక వ్యవస్థకు ప్రతినిధి అయిన శ్రీరామచంద్రుడు ఆదర్శం కావటం యాదృశ్చికంగాదు. ఆ నాయకత్వం అధికార మార్పిడిని ఆశించిందే తప్ప, వ్యవస్థ యొక్క మౌలిక మార్పుని కోరలేదు.

భారతీయ ఫ్యూడలిజం (భూస్వామ్య విధానం) యొక్క ప్రత్యేక సాంఘిక లక్షణం ఏమిటంటే వర్ణకుల వ్యవస్థ. ఇది ప్రజానీకాన్ని ధనికులూ ఇంటూ పేదలు: భూస్వాములూ ఇంటూ రైతులూ, అనే స్పష్టమైన రూపాలను మసకబరుస్తూ అగ్రవర్ణాలూ ఇంటూ శూద్రులూ+హరిజన, గిరిజనులు : అగ్రకులాలూ ఇంటూ వెనుకబడిన కులాలూ+హరిజన గిరిజనులుగా విభజించింది. ఇలా ఒక సంక్లిష్ట సామాజిక వ్యవస్థ మనదేశంలో నెలకొని వున్నది.

ఫ్యూడల్ రాచరిక వ్యవస్థలకు సహజంగావుండే నిరంకుశత్వానికి తోడు వర్ణ వ్యవస్థల సాంఘిక వివక్షత మన ప్రజల హక్కులనూ, ఆశలనూ, కనీస కోర్కెలనూ క్రూరంగా నిర్దాక్షిణ్యంగా అణచివేశాయి. ఫ్యూడల్ వర్ణ వ్యవస్థకు పుట్టిన భారతీయ కర్మసిద్ధాంతం నిమ్నవర్ణాలవారిపై పుట్టుకతోనే అధములమని తామే విశ్వసించేటంత భయంకర సాంస్కృతిక పీడనను అమలు జరిపింది. బ్రిటీషు సామ్రాజ్యవాదుల దయాదాక్షిణ్యాలపై అభివృద్ధిగాంచిన పారిశ్రామికరంగం ఈనాటికీ తన స్వంత వెన్నుపూసపై నిలబడ లేకపోతోంది. గత 43 సంవత్సరాల కాలంలో భూస్వామ్య వ్యవస్థలో కొన్ని సర్దుబాట్లు, సంస్కరణలు జరిగాయి కానీ దాని మూలాలు సమూలంగా కదలలేదు. ఒక్కమాటలో చెప్పాలంటే భారతదేశం ఈ

నాటికీ సామ్రాజ్యవాదులపై ఆధారపడి భూస్వామ్య పెట్టుబడిదారీ దేశంగానే వుంది.

అందుకే మనకు ప్రజాస్వామ్య లక్షణమైన ఎన్నిక లుంటాయి. కానీ ప్రజలకు స్వేచ్ఛగా ఓటు వేసే హక్కు వుండదు! (డబ్బు, సారా, గూండాయిజం, కుల మత హద్దులు వుంటాయి. అసెంబ్లీలు, పార్లమెంట్లూ వుంటాయి. కానీ వంశపారం పర్యంగా గానీ, కుటుంబపరంగా గానీ పరిపాలనకు స్వచ్ఛంద ఆమోదంవుంటుంది. రాజకీయాలలో కుటుంబవారసత్వం కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది.

రాజ్యాంగ చట్టంలో లౌకిక వాదమూ, ప్రజాస్వామ్యమూ, సోషలిజమూ వుంటాయి. ఆచరణలో మతతత్వానికి సహకారం లభిస్తుంది. శ్రామికులూ, స్త్రీలూ నిమ్నకులాలపై అణచివేత వుంటుంది. నిత్యదరిద్రులూ-అగర్భ శ్రీమంతులూ ఆవిర్భ విస్తారు.

ఆర్థిక రంగంలో స్వతంత్ర పారిశ్రామిక పెట్టుబడిదారీ వర్గం అభివృద్ధి చెంద నట్టే రాజకీయాలలో కూడా ప్రజాస్వామిక, లౌకిక విలువల కోసం నిజాయితీగా రొమ్మువిరిచి నిలబడేవాడు పాలకవర్గ పార్టీలలో కొనసాగలేడు. దేశాన్ని హిందూ మతతత్వ రాజ్యంగా సంపూర్ణంగా రూపొందించాలని "నిజాయితీ"గా కృషి చేసే బి.జె.పి. లాంటి వారి ప్రయత్నాలు ఏ వర్గపు ప్రయోజనాలను, ఆర్థిక రాజకీయ వ్యవస్థలనూ కాపాడతాయో వేరే చెప్పనక్కరలేదు.

ఫ్యూడల్ దోపిడీ నుండీ, సామ్రాజ్యవాదుల అదుపు నుండీ బయట పడ లేదు కనుకనే దేశ ఆర్థిక రాజకీయ వ్యవస్థలూ, విధానాలూ సార్వత్రిక సంక్షోభంలో పడి ఒక సుడిగుండంలో నుండి మరొక సుడిగుండంలోకి ప్రయాణిస్తున్నాయి.

ఈ మూల కారణాలనుండే ఇతరేతర సమస్యలు పుడుతున్నాయి. నిరుద్యోగం నిజాయితీ హీనత, అవినీతీ, అధిక ధరలూ, పతన సంస్కృతి మొదలైనవి. ఫ్యూడల్ వ్యవస్థకూ, దానికరడు గట్టిన మతతత్వ వ్యాప్తికీ వ్యతిరేకంగా యూరపులోలాగా భారత పెట్టుబడిదారులు ఒకవర్గంగా నాయకత్వం వహించటానికి గతంలో ముందుకు రాలేదు. ఇక రాలేరు కూడా.

## ఆ కర్తవ్యం భారత శ్రామిక వర్గం మీదనే వుంది

వ్యవస్థ విసురుతున్న సవాళ్ళకువిసుగు చెందిన ప్రజానీకం, సంఘటితంగానూ అసంఘటితంగానూ కొండకోనల నుండి రాజధానీ నగరాల వరకు ప్రజాస్వామిక హక్కుల కోసం పోరాడుతున్నారు. సంస్కరణల బెల్లమూ, నిర్బంధపుకత్తీ చెరో చేత్తో పుచ్చుకున్న పాలక వర్గాలు ప్రజా పోరాటాలను అణచివేస్తూనే. అసంతృప్తి తీవ్రమైనపుడు సంస్కరణల బెల్లాన్ని రాజకీయ ప్రయోజనాల కోసం వాడుతున్నాయి. తమ ఆర్థిక రాజకీయ హక్కులకోసం శ్రామిక నిమ్నకులాల ప్రజలూ, మహిళలు డిమాండ్ చేస్తున్నారు. మరింత నిరంకుశ విధానాల ద్వారా తప్ప వీరి ఆందోళనలని అణచి వేయటం సాధ్యంకాని స్థితికి పాలకవర్గాలు చేరుకున్నాయి.

భారత ఉప ఖండంలోని అనేక జాతుల ప్రజలు స్వయం నిర్ణయాధికార హక్కుల కొరకూ, ప్రాంతీయ భాషాభివృద్ధికీ, దేశీయ సంపదల సమాన వాటా కొరకూ డిమాండ్ చేస్తూ గత 43 సంవత్సరాల నుండి ఆందోళన చేస్తూనే వున్నాయి. కేంద్ర ప్రభుత్వంపై సంపూర్ణంగా ఆధారపడి చేతులు కట్టుకు నిలబడవలసిన దుస్థితి లోనే ప్రాంతీయ ప్రభుత్వాలున్నాయి. ఫెడరల్ (సమాఖ్య) రాజ్య ఆదర్శం కాగితా లకే పరిమితమై యూనిటరీ (నిరంకుశ కేంద్రం) విధానాలు అమలు జరుగు తున్నాయి.

ఏ ఒక్క జాతీ తాను స్వతంత్రంగా అభివృద్ధి చెందాలని భావించినా సాధ్యం కానీయకుండా, అన్ని జాతులనూ ఏకకాలంలో దోపిడీ చేసుకోవాలని కోరుకునే అమెరికా, రష్యా, బ్రిటన్, ఫ్రాన్స్, జర్మనీ, జపాన్ లాంటి సామ్రాజ్యవాదులూ వారి దళారీలైన పెద్ద పెట్టుబడిదారులూ కోరుకుంటున్నారు. ప్రజల ఆందోళనలనూ జాతుల పోరాటాలనూ సాధారణ పద్ధతులలో నిలువరించలేని పరిస్థితి ఏర్పడింది. కనుక వీరందరికీ సుస్థిరమైన, మరింత నిరంకుశమైన పాసిస్టు రాజకీయవ్యవస్థా, సంస్కృతీ అవసరమవుతుంది. తాము దోపిడీ చేసుకోవడానికి సమైక్య, పి ల భారత దేశం అవసరమవుతుంది. దీనిని సాధించి పెట్టగల రాజకీయ సిద్ధాంతం ఏదీ ?

**అదే మెజారిటీ మత తత్వం!**

మెజారిటీ మతస్తులు హిందువులు కనుక, హిందువులందరూ ఒకే జాతి అనే కృత్రిమ సిద్ధాంతాన్ని రూపొందించి అన్య మతస్తుల్ని దౌర్జన్యంగా లొంగదీసు కోవటం, నిజమైన జాతీయ వాంఛల్నీ పోరాటాల్ని అణచివెయ్యటం- ఒక రాజకీయ విధానంగా ఎంచుకున్నారు. అదే హిందూ ధర్మంగా ప్రచారం చేస్తున్నారు. భారతీయ సంస్కృతి పేరుతో హిందూ సంస్కృతినీ, దాని నీడన అగ్రవర్ణ దోపిడీ పీడనల సంస్కృతినీ రుద్ద నెంచుకున్నారు. ప్రాచీన కాలంనాడు ఆర్యులు వివిధ తెగల వారిని ఓడించి లొంగదీసుకున్నట్టుగా ఈనాటి పాలకవర్గాలు ఉప ఖండంలోని భిన్నజాతుల ప్రజలను అణచివుంచాలని కోరుకుంటున్నారు. అందుకే ఫ్యూడల్ రాచరిక వ్యవస్థకు ప్రతినిధి అయిన శ్రీరామచంద్రమహారాజ్‌ను దైవాంశ సంభూతుడంటారు. (నా విష్ణుః పృథ్వీ పతిః), రాచభక్తే దేశభక్తిగానూ, రాముడే దేశంగానూ, రామభక్తే దేశభక్తి గానూ నమ్మిస్తారు. ఇదే వారి హిందూ జాతి సిద్ధాంత సారం.

వారి ప్రకటనలు కూడా దీన్ని రుజువు చేస్తూవుంటాయి. "రాముని పట్ల భక్తి భావన ఈ జాతిని సమైక్యపరచగల శక్తివంతమైన సాధనం. ఇదే అద్వానీ రథయాత్రా సందేశం" (ఎందుకీ రథయాత్ర?)

బ్రిటీషు సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా భారతీయులు ఏకమయ్యారు. నిజాం నిరంకుశత్వానికీ, భూస్వాముల జమీందార్ల దోపిడీకీ వ్యతిరేకంగా రైతు కూలీ లేకమయ్యారు. రాముని పేరుతో హిందువులందరూ సమైక్యమై ఎవరిని

ఓడించాలి? ముస్లిములనేది సున్నితమైన సాకు మాత్రమే. అసలిది పీడిత ప్రజల్నీ, వివిధ జాతులనీ సాంస్కృతికంగా అణచి వుంచటం. ఆ విధంగా దోపిడీ వ్యవస్థకు శాశ్వత "ధర్మ" రక్షణ చేయటం. ఇదే ఆర్.ఎస్.ఎస్. అసలు రాజకీయ సారం.

వారు కోరుకుంటున్నట్టుగా భారతదేశంలోని అన్ని కులాలు, మతాలూ, తెగలూ ఒక్కరేమిటందరూ రామభక్త హనుమాన్‌లుగా మారతారు అనుకుందాం. అయితే ఏమిటి ప్రయోజనం ? ఇంకొక 500 మసీదులు పడగొట్టి వాటి సమాధులపై దేవాలయాలు నిర్మిద్దాం-అయితే ఏమిటీ వొరిగిపడేది? నిరుద్యోగులకు పనులు దొరుకుతాయా ? (మసీదులు ధ్వంసం చేసి, దేవాలయాలు నిర్మించే పనులు అయిపోయిన తర్వాత) ఆకాశంలో వున్న ధరలు ఠపీమని నేలమీద పడిపోతాయా? వ్యవసాయ కూలీలకూ, పేదరైతులకూ తాము కష్టపడి పనిచేస్తున్న భూమిపై హక్కులు ఏర్పడతాయా ? కింది కులాలవారిని ఓట్లకోసం కాకుండా నిజంగా గౌరవించటం మొదలవుతుందా ? వరకట్నాలూ వాటివల్ల హత్యలూ, ఆత్మహత్యలూ ఆకస్మికంగా ఆగిపోతాయా ? గుండాయిజమూ. హింసా, అత్యాచారాలూ, తాగుడూ, వ్యభిచారమూ అదృశ్యమైపోతాయా? ఏ ఒక్కటీ సోదు-ఎందుకంటే వీటికి మూలాలు నేటి సామాజిక వ్యవస్థలో వున్నాయి కనుక. పాలకవర్గాల రాజకీయ విధానాలలో వున్నాయి కనుక. స్వదేశీ దోపిడీ పీడనల్లో వుంది కనుక.

వీరు రాముని పేరుతో సాధించే "సమైక్యత", తద్వారా నెలకొల్పదలచుకున్న ఫాసిస్టు పరిపాలనా విధానమూ-అత్యధికులైన ఈ దేశ శ్రామిక ప్రజానీకాన్నీ, మధ్య తరగతి జీవుల్ని, కార్మిక కర్షక జనావళినీ శాశ్వతంగా దోపిడీ వ్యవస్థను ఎదిరించకుండా వుంచటానికి మాత్రమే ఉపయోగపడుతుంది. దేశ జనాభాలో సగం మందిగా వున్న స్త్రీలను పురుషాధిక్యతా పీడనల కిందనే తొక్కి వుంచుతుంది. (ఖొమైనీ లాగా చెయ్యలేక పోతున్నామే అని వీరి బాధ) వెనుకబడిన నిమ్నకులాల సాంఘిక, ఆర్థిక పీడితులను తలెత్తనివ్వకుండా అణచివేస్తుంది. వివిధ జాతుల, తెగల ఆకాంక్షలను చంపేస్తుంది. ఒకేజాతి, సంస్కృతి, భాషఅనే అగ్రవర్ణదురహంకార వ్యవస్థను సుస్థిరం చేస్తుంది. ఆ విధంగా సామ్రాజ్యవాదులపై ఆధారపడిన బూర్జువా-భూస్వామ్య వర్గాల దోపిడీని శాశ్వతం చేస్తుంది.

## మతోన్మాద ఫాసిస్టు రాజకీయాలను ఓడించండి !

బి.జె.పి. వారు రెచ్చగొడుతున్న మతోన్మాదమూ, కవ్వించి సాగిస్తున్న ఘర్షణలూ పైపైన చూస్తే కేవలం వారు దేవుని గురించీ, మతం గురించి తాపత్రయపడుతున్న వారు గానే కనిపిస్తారు. బాబ్రీ మసీదు సమస్య పరిష్కారమైపోతే వారు శాంతిస్తారనీ ప్రశాంతత, నెలకొంటుందని కొందరు భ్రమపడతారు. కానీ వారికి సమగ్ర ఆర్థిక రాజకీయ సిద్ధాంతాలున్నాయి. సామాజిక సాంస్కృతిక దృక్పథం

వున్నది. వాటిని దృఢంగా అమలుపర్చాలనే కరడుగట్టినవైఖరులున్నాయి. "ఉద్యమ మంటూ చేస్తే ఇప్పుడు విజయాలకోసమే చేయాలి" అనే విశ్వాసం వుంది. అయితే అవి ఏ వర్గ ప్రయోజనాలను కాపాడతాయి అన్నదే అసలు ప్రశ్న.

వారి "రథయాత్ర ఎందుకు?"లోనే తమ పరమార్థాన్ని వెల్లడి చేశారు. "ఒకటి మాత్రం సుస్పష్టం. ఈ యాత్ర యొక్క పరమార్థం చాలా విశాలమైనది. కేవలం "ఓట్లు" అనే అతి తక్కువ విషయానికి ఇంత మహత్తర ఉద్యమాన్ని ముడిపెట్టటం తగదు. యావత్తు హిందూ సమాజాన్ని చైతన్యవంతం చేసేందుకు జరుగుతున్న ప్రయత్నం యిది. దాని ఫలితాలు రాజకీయాలలో కూడా లభించవచ్చు. అయితే యాత్ర లక్ష్యం రాజకీయం ఎంత మాత్రం కాదు." (పేజీ 10)

వారీనాడు సాగిస్తున్న "రథ జైత్రయాత్ర"కి తాత్కాలిక ప్రయోజనమూ, దీర్ఘ కాలిక లక్ష్యమూ వున్నాయి. "కాంగ్రేసూ, జనతాదళ్‌లు ఈ (దోపిడీ) వ్యవస్థను ఒడుదుడుకులు లేకుండా కాపాడలేకపోతున్నారు. బి.జె.పి. అయితే దృఢంగాసామా జిక కల్లోలాలు చెలరేగకుండా ప్రజానీకాన్ని అణచి వుంచగలరు." అని పాలకవర్గాల ముందు రుజువు చేసుకోవటం వారి తక్షణ రాజకీయ లక్ష్యం.

రాముణ్ని,హిందూ సంస్కృతిని ప్రచారంచేసి మెజారిటీ ప్రజానీకం స్వచ్ఛం దంగా దోపిడీ వ్యవస్థ ఉత్తమమైనదని భావించే మానసిక స్థితిలోకి వచ్చేట్టు"చైతన్య వంతం" చేయటం వారి మరొక ఉద్దేశ్యం.

సున్నితమైన మత విశ్వాలను రెచ్చగొట్టడంద్వారా అత్యధికుల్ని ఆకట్టుకుని హింసా దౌర్జన్యాలను ప్రేరేపిస్తూ, "దోపిడీ ధర్మాన్ని ఎదిరించే వారందరూ దైవ, దేశ ద్రోహులేనని ప్రకటించటం, అణచివుంచటం వారి వ్యూహాత్మక రాజకీయ ఎత్తు గడ. హిందువుల్లోని మెజారిటీ పేద ప్రజలను ఆకట్టుకొని, ముస్లింలతో నిరంతర ఘర్షణల్లో మునిగిపోయేట్టు చేసి, మౌలిక, ఆర్థిక, రాజకీయ సమస్యలపై పాలక వర్గా లతో పోరాడనివ్వకుండా చేయటం, దోపిడీ, పీడనలకు వ్యతిరేకంగానూ, వివిధ న్యాయమైన సమస్యలపై ఆందోళనా, పోరాటాలకు దిగిన వారినీ, అందుకు నాయక త్వం వహిస్తున్న వారిని కేవలం చట్టాలూ, కోర్టులూ, పోలీసులతో అదుపు చేయటం కష్టం. జర్మనీ నాజీ ముఠాలాగా రాజ్యేతర అణచివేత, ఫాసిస్టు ముఠాని రూపొం దించుకుని "సామాజిక స్థిరత్వాన్ని" అంటే యథాతథ దోపిడీ విధానాలకు భంగం కలుగ నివ్వకుండా చూడటం.

హిందీని జాతీయ భాష పేరుతో రుద్ది మిగిలిన భాషలను అభివృద్ధి కానివ్వ కుండా చూడట : నిజానికి హిందీ కూడా భారత ఉపఖండంలో ఒక ప్రాంతీయ భాష మాత్రమే. బలమైన కేంద్ర ప్రభుత్వం పేరుతో భిన్న జాతుల రాష్ట్రాలను అణచివేయటం: ఉప ఖండంలో విస్తరణ శక్తిగా తయారయి అగ్ర రాజ్యాల

(అమెరికా, రష్యాల) దోపిడీకి ఒడుదుడుకులు లేకుండా చూడటం. ఇదీ వారి పరమార్థం.

ఇదే వారి తక్షణ, దీర్ఘకాలిక లక్ష్యాలు. మానవ ప్రాణంపట్ల వారికి కించిత్ గౌరవం కూడా లేదని వారి గత, ప్రస్తుత చరిత్ర తెలుపుతోంది.

మానవ జాతి సాధించిన ప్రగతి పట్లా. పీడిత తాడిత ప్రజానీకం సాగిస్తున్న పోరాటాల పట్లా, శ్రామికవర్గ ప్రజాస్వామ్య సంస్కృతి పట్లా వారి కేవిధమైన ఆదరణా లేవు. కనుకనే హిందూ మతోన్మాద ఫాసిస్టు రాజకీయ ఆలోచనలకూ వాటి అధిపత్యానికై ప్రజల విశ్వాసాలను దుర్వినియోగం చేస్తూ మానవ మారణకాండకు, సంస్కృతుల విధ్వంసానికి సిద్ధపడిన ఆర్.ఎస్.ఎస్. దాని వివిధ అంగాలకూ వ్యతిరేకంగా ఈనాడు రాజకీయ, సాంస్కృతిక పోరాటం తప్పనిసరి.

## మన కనీస కర్తవ్యం :

లౌకిక ప్రజాస్వామిక విలువలు నెలకొల్పడానికి బాబ్రీ మసీదు తరహా వివాదాలను రేప కూడదని ప్రజానీకం ఎలుగెత్తి చాటాలి.

రేడీయో, టి.వి. సినిమాలలో కులమతతత్వ ధోరణులనుపెంచే ప్రసారాలూ, ప్రదర్శనలూ నిలిపి వేయమని కోరాలి. మతతత్వంతో కూడిన చరిత్ర పాఠాలను తొలగించి ఈనాటి సామాజిక అవసరమైన లౌకిక ప్రజాస్వామ్య దృక్పథం వెలుగులో వాస్తవికంగా తిరిగి రాసుకోవాలి.

రాజకీయ నాయకులూ, మంత్రులూ, ప్రజాప్రతినిధులూ, ప్రభుత్వ కార్యకలాపాలలో, బహిరంగ ప్రదేశాలలో వ్యక్తిగత మత విశ్వాసాలను ప్రదర్శించుకొననివ్వకుండా చూడాలి. ఎన్నికలలో ఓట్ల, సీట్ల స్వార్థం కోసం పతన సంస్కృతీ విలువలను పెంచి పోషించడాన్ని ఖండించాలి. కుల, మత ప్రాతిపదికపై జరుగుతున్న ఎన్నికలను ప్రజాస్వామ్య, లౌకిక విధానాలకు విరుద్ధమైనవిగా ప్రకటించాలి.

శ్రమ జీవులనూ, శ్రమనూ అసహ్యించుకుని, నీచమైనదిగా పరిగణించే అగ్రవర్ణ దురంహకార దుర్మార్గ సంస్కృతిని ఎండగట్టాలి.

ఇవి మాత్రమే మతతత్వానికి గల ఆర్థిక, సాంఘిక భౌతిక పునాదులను పెకలించే ఉద్యమాలకి ఊపు నివ్వగలిగేది. అంతిమంగా ఓడించి నిర్మూలించగలిగేది.

ఇదే సాధించలేకపోతే ప్రముఖ చరిత్ర రచయిత రొమిల్లా థాపర్ చెప్పినట్టు - మనం "బల ప్రయోగ రాజకీయాలను పెంపొందించే మతవాద సిద్ధాంతాల ఊబిలో బిగుసుకుపోతే, మత రాజకీయాల ఊబిలో చిక్కుకుపోతే, మత మౌఢ్య మౌలిక వాదపు ఫాసిస్టు శక్తులకు లొంగిపోతే, మనమందరమూ కలలుగనే నూతన సమాజ నిర్మాణానికి అదొక విషాద ఘట్టం" రామ జన్మభూమి- వివాదం విశ్లేషణ (పేజీ-38) అందుకే ఎలుగెత్తి చాటండి. →

# పుట్టుమచ్చ

ఒక కట్టుకథ నన్ను కాటేసింది
ఒక వక్రీకరణ నన్ను వంచించింది
ఒక అపనింద నన్ను అల్లరి పాల్జేసింది
1955 అగస్టు 10 నా పుట్టిన తేది
కృష్ణా జిల్లాలో ఒక మారుమూల
కుగ్రామం మా వూరు
నేను పుట్టకముందే
దేశద్రోహుల జాబితాలో
నమోదై వుంది నాపేరు
కన్నబిడ్డని సవతి కొడుకుగా
చిత్రించింది చరిత్ర
అన్నదమ్ముల్నించి చీల్చి
నన్ను ఒంటరివాణ్ణి చేసింది చరిత్ర
పసితనంలోనే
నన్ను పరిహసించాయి
పాఠ్యపుస్తకాలు
పోత పోసుకుంటూన్న
నా వ్యక్తిత్వం మీదికి
వింత వింత భయాల్ని ఉసి గొలిపి
నిర్దాక్షిణ్యంగా నన్ను చిత్రవధ చేసి
సుడిగాలుల పాల్జేసింది చరిత్ర
నా ప్రమేయంలేని పరిణామాలకు
నన్ను కర్తను చేస్తూంది వర్తమానం
నా అస్తిత్వం చుట్టూ
అనుమానాల వలయాల్ని విస్తరిస్తూంది
వర్తమానం
నా నెత్తిమీద సదా
నిఘా నీడల్ని విసిరేస్తూంది వర్తమానం
ఆడపిల్ల అందాల్ని బంధించినట్టు
నా ఆహారాన్ని అంకెల్లోకి దట్టించి
నా యింట కన్ను తెరచిన
నవజాత శిశువు తెగ్గోసుకున్న
తల్లిపేగు చివర తడియారని నెత్తుటి

1947ని దర్శిస్తూంది వర్తమానం
హిందీ - హిందూ - హిందూస్తాన్
ముస్లిం జావో పాకిస్తాన్
"ముసల్మాన్ కే దో హీ స్థాన్"
పాకిస్తాన్ యా ఖబరస్తాన్'
నినాదాల నర్తనశాలలో
నన్ను నిస్సహాయుణ్ణి చేస్తూంది
వర్తమానం
రాజ్యాంగం నా భుజం తట్టను
మీసాల గుబురుల్లోంచి
ముసిముసిగా నవ్వుకుంటూన్న
మూడు సింహాల సింహాసనం

→ బాబ్రీ మసీదు శిథిలాలపైనా, మానవ రక్తకంకాళాలపైన నడుచుకుంటూ ఢిల్లీ సింహాసనాన్ని కైవసం చేసుకోవాలని ఆశపడుతున్న హిందూ మతోన్మాద శక్తులను అడుగడుగునా ప్రతిఘటించండి.

లౌకిక ప్రజాస్వామ్య శక్తులారా ఏకంకండి !
వంద గుళ్ళూ మసీదుల కన్నా ఒక మానవ ప్రాణం మిన్న !
ప్రేమతో చెప్పండి ! మనమంతా మానవులమని !!!

(జనసాహితీ ప్రచురణ : "అయోధ్యలో రావణ కాష్టం" అక్టోబరు 1990)

నా కేసి ముఖం తిప్పదు
ప్రథమ శ్రేణి పౌరుని మస్తిష్కంలో
పరదేశీగా తప్ప, 1947 కి స్మారక
స్థూపంలా తప్ప
మనిషిగా నా బొమ్మ రూపు గట్టదు
అవును, నేను కుట్రదారుణ్ణి కదూ!
అవును ఇస్లాంకీ, ఇస్లామాబాద్‌కీ మధ్య
అభేదాన్ని పాటించడం కుట్ర కాదు
నా కాళ్ళ కింద నేలని
తొలిచేయా లనుకోవడం కుట్ర కాదు
పుట్టి పెరిగిన దేశంలోనే
నన్నొక కాందిశీకుణ్ణి చేయడం కుట్ర కాదు
పరిసరాల్నీ, వాతావరణాన్నీ
నా చుట్టూ విష పూరితం చేయడం
కుట్ర కాదు
ఖండఖండాలుగా నరికి
నిలువునా నన్ను నిర్మూలించి
'అఖండ భారతం' నిర్మించాలని
కలలు గనడం కుట్ర కాదు
కేవలం నా మత విశ్వాసాలు కుట్ర
నా సామూహిక ప్రార్థన సమావేశాలు
కుట్ర
నేను మత్తుగా పడి వుండటం కుట్ర
నేను మేల్కొనేందుకు ప్రయత్నించడం
కుట్ర
నేను నలుగురితో కలసి వుండాలనుకోవ
డం కుట్ర
నేను బతికి బట్ట కట్టాలనుకోవడం కుట్ర
నా అజ్ఞానం కుట్ర, నా వెనుకబాటు
తనం కుట్ర
నేను పెళ్ళాడటం కుట్ర, నేను పిల్లల్ని
కనడం కుట్ర
స్థాయీ భేదాల సారాంశంలో

రాజ్యాంగం నాతో ఆడిన
'పవిత్రమైన' పరాచికం నా పౌరసత్వం
పట్టెడన్నం కోసం
పేవ్‌మెంటులమీద పూలమ్ముకుంటాను
పళ్ళమ్ముకుంటాను, పల్లీలమ్ముకుంటాను
గొడుగులు బాగు చేస్తుంటాను
గడియారాలు బాగు చేస్తుంటాను
వీధరుగుల మీద దర్జీ పని చేస్తుంటాను
దూదేకుతుంటాను దినం గడుపుకుంటాను
ఏ గొడవల్లేకుండా
బతుకును వెళ్ళమార్చాలనుకుంటాను
ఉన్నట్టుండి ఎందుకో మరి
నగరాల నడివీధుల్లో నా నెత్తురు
తీర్థస్నాన ఘట్ట మవుతుంది
ఎన్నికలకు ముందు
ఎన్నెన్నో సంఘటనలకు ముందు
దేశచరిత్ర దిశా నిర్దేశానికి
నా నెత్తురు సూచికైపోతుంది
పార్లమెంటు భవనంలో వారెందుకు
నా నెత్తురు పాదలేపనమవుతుంది
నా రక్తం రియల్ ఎస్టేట్
వ్యాపారమవుతుంది
నా రక్తం రాజ్యాధికారానికి
రక్షణ కవచమవుతుంది
నా రక్తం పదవీసోపానానికి
అభయ 'హస్త' మవుతుంది
నా రక్తం 'భరతమాత' నుదుటి
తిలకమవుతుంది, పూజా 'కమల'
మవుతుంది
నేను వేసిన ప్రతి ముందడుగూ
ఒక నెత్తుటి మడుగవుతుంది
నా గూడు బాణసంచా అవుతుంది
నా గూడు భోగి మంటవుతుంది

నా గూడు నరకాసురుని చిః
మవుతుంది
భవిష్యత్ తరాల కోసం
ఆది మానవుడు చరిత్రగూట్లో భద్ర
పరిచిన
పావురాల గుడ్లు చితికి పోతాయి
పటపటమని విరిగి పోతూన్న
నేలతల్లి పక్కటెముకల శబ్దం
నా చెవుల్లో చివరిసారిగా ప్రతిధ్వనిస్తుంది
కలలు నా మాతృభాషలో రావటం మాను
కుంటాయి
నా ఆలోచనలు సయితం అధికుల
భాషనే ఆశ్రయిస్తాయి
క్రికెట్ మాచ్ నా దేశభక్తికి
తూనికా, కొలమానవుతుంది
నేను నా మాతృదేశాన్ని
ఎంతగా ప్రేమిస్తున్నానన్నది కాదు
ఏయే పరాయి దేశాల్ని
ఎంతెంతగా ద్వేషిస్తున్నా నన్నదే
నా దేశ భక్తికి ఎంతో కొంత ఆధార
మవుతుంది
వెండి తెరల మీంచీ
రంగస్థలాల మీంచీ
కళామర్మజ్ఞుల విచిత్ర విన్యాసాల మీంచీ
నా విదూషక ఖలనాయకుని వేషం
అందరికీ వినోదాన్ని అందిస్తుంది
సాంస్కృతికంగా నన్నొక వికలాంగుణ్ణి
చేస్తుంది
క్షమించండి, నా స్నేహితుల్లారా!
వక్రీకరణకి వత్తాసుగా
పద బంధాన్ని సృష్టించి
నన్ను వెక్కిరించటానికి వెనుదీయని
మహాకవిని.[1] నేను మన్నించలేను!

మన్నించండి, నా మిత్రుల్లారా!
రాజుకీ, పేదకీ మధ్య
భేదాన్నే చూడలేని
ప్రజాకవి.[2] ఉద్రేకానికి
నేను ఉర్రూత లూగలేను
హింసకి ప్రతిరూపంగా
అసహనానికి ప్రతీకగా
నా గురించి జరిగే ప్రచారాల్ని విని
నేను నవ్వుకుంటాను
నా నవ్వులకు సమాధానంగా
నిందలు ప్రతిధ్వనిస్తుంటాయి
నిజానికి నీది నవ్వు కాదు
నేను అను నిత్యం
అతి సునాయాసంగా
దిగమింగే నా ఆర్తనాదం
అగ్ర వర్ణం అన్యాయంగా
నా మెడ చుట్టూ బిగించి వెళ్ళిన
పర్సనల్ లా ముళ్ళ కంచె గురించి
బాధపడాల్సింది మరెవరో కాదు నేనే
ఆర్టికల్ 370 గురించి
అణగారి పోవాల్సింది ఎవరో కాదు నేనే
ఆచరణతో ప్రమేయం లేని
అక్షరాల లౌకిక భావనకి
అన్యాయమై పోయింది ఎవరోకాదు నేనే
అవును, నాదిమచ్చపుటక అన్నారు కదూ!
నన్ను ఏకంగా పుట్టుమచ్చగా పునీతం
చేశారు కదూ !
పెత్తందార్ల ఎత్తుగడలు, వ్యూహాలకీ
నాచుట్టూ అల్లుకుంటున్న ఉరితాళ్ళకీమధ్య
ఏమిటీ అనుబంధం అని అడగలేను
వాళ్ళూవాళ్ళూ కలిసి పంచుకున్న వూళ్ళ
మధ్య
అర్ధరాత్రి సరిహద్దు రేఖలా పారిన నెత్తుటి

యేరుతో
ఏమిటీ నాకున్న సంబంధం అని నిల
దీయలేను
త్రిశూలాల మొనల మీదా
పి. ఏ. సి. తుపాకుల కొనల మీదా
బాలెట్ బాక్సుల కొనల మీదా
నెత్తురోడుతున్న నాపుట్టుమచ్చను గురించి
ప్రశ్నించలేను
అవును, పుట్టుమచ్చ నీ ఉనికి

పుట్టుమచ్చ నా అస్తిత్వం
పుట్టుమచ్చ నా పౌరసత్వం
నేను ఊపిరి పీలుస్తూ మసలుతూన్న
నేలా, గాలీ పరిసరాలూ
నాకు దాఖలు పరిచిన పౌరసత్వం
పుట్టుమచ్చ
ఎన్నటికీ మానని గాయం యీ
పుట్టుమచ్చ

— ఖాదర్ మొహియుద్దీన్

1. మహాకవి శ్రీశ్రీ 'కసాయి' 'సాయిబు' అనే పదాల్ని కలిపి 'కసాయిబు' అనే పదబంధాన్ని తాను సృష్టించినట్టు వ్యాసక్రీడల్లో చెప్పుకున్నాడు.
2. ప్రజాకవి సుద్దాల హనుమంతు 'వెయ్, వెయ్‌ర దెబ్బ, వెయ్ /తరగర, నరకర/ తురకలు గుండా గొయ్యలు, అంటూ ఒక పాట రాశాడు. నిజామ్ నవాబు ముస్లిం కాబట్టి ఏకంగా తురకల్ని తరిగేయమని పిలుపునిచ్చాడు. తెలంగాణా రైతాంగ సాయుధ పోరాట చరిత్రలో 'బందగీ' వంటి 'తురక'ల పాత్రను విచిత్రంగా విస్మరించాడు.

('పుట్టుమచ్చ' కవితా సంకలనం నుంచి)

---

## ఉత్తరాలు :

....'కన్యాశుల్కంలో కుటుంబవ్యవస్థ' కాత్యాయనీ విద్మహే, 'కన్యాశుల్కం-రచనా సంవిధానం-ప్రదర్శన' (కాకరాల) వ్యాసాలు మెన్నో కొత్త సంగతులు నేర్పాయి. 1892 నాటి 'తెలుగు హార్పు' వార్త చరిత్రాత్మకమైనది....

....యిక నాటకం (నెల్లూరులో అరుణోదయ కళాకారులు ప్రదర్శించిన వీధినాటం 'శబ్దం') గంటపైగా వొచ్చినా ఆర్టిస్టులు చక్కగా నటించడంవల్ల సమయం తెలియదు.

తిరుపతి

—సౌదా

గల్పిక :

# తీర్పు

— మహమ్మదాలి

"మసీదును కూల్చాలా ? మందిరాన్ని కట్టాలా? కూల్చే ముందు అడ్డుకునే సందున అద్వానీకీ, అశోక్ సింఘాల్‌కీ, షాబుద్దీన్‌కీ సల్లాఉద్దీన్‌కే సమతా తీర్పు. చెవి యొగ్గి వినండి —

"మహమ్మదీయులు పరమత ద్రోహులు. వేల మందిరాల్ని కూల్చారు."

"హిందువులు మతోన్మాదులు. బౌద్ధ ఆరామాల్ని ఐపు లేకుండా చేశారు. బౌద్ధం బిగా చోరు- పర మత దేవాలయాలపై మతసూక్తులు చెక్కించారు. శిక్కులు, జైనులు తక్కువ తిన్లేదు. క్రిస్టియన్లు కిమ్మత్తుగా స్థలం ఆక్రమించి శిలువ మందిరాలు కట్టారు."

అందరూ ఒక్కసారిగా — "మా మతం మంచిది. మా గతం ఎంచకండి."

"గతాలు ఎంచబట్టే ఈ గతి కొచ్చింది. నేతులు తాగిన మూతులు నాకే దశ కొచ్చాం."

"మాకు న్యాయం కావాలి ! మాకు న్యాయం కావాలి!" (పెద్దగా అరుపులు)

"అలాగే! అందరికీ న్యాయం జరగాలి! ముందుగా మాత్రం అద్వానీకి. ఎందుకంటే మెజారిటీ మతాధిపతి కదా! అందుకే ఆయన దగ్గర్నుంచే అంకురార్పణ జరగాలి!"

"అందరూ అటెంషన్‌లో నిలవండి! గలభా చెయ్యొద్దు" చెవొగ్గి వినండి. మరొకసారి చెపుతున్నా!

"మీ మీ ఆరామాలు నిలబెట్టుకోండి."

"కూల్చిన మసీదులు కట్టుకోండి."

"పేల్చిన మందిరాలు నిర్మించుకోండి."

"మీ 'దాడీలు' సవరించుకోండి."

"మీ 'నామాలు' సరిదిద్దుకోండి."

(అందరి ముఖాల్లో ఆతృత - ఆనందం)

"అదే కోరేది! అందరం చరిత్రను పునర్నిర్మిద్దాం!"

"సాంస్కృతిక కట్టుబాలను పునరుజ్జీవింపచేద్దాం

"వెనుకటి మానవ జీవితం కూడా పునఃప్రారంభిద్దాం!"

"మా తాతల నాటి నుండి ప్రారంభిద్దాం."

"కాదు. మా ముత్తాతల కాలం నుండి."

"నో .... నో .... మా వంద తరాల తాతల నుండి."

"కాదు .... కాదు .... వీలుపడదు. మా కోట్ల తరాల తాతల నాటి నుండి -
"లేదు .... లేదు శతకోటి కోట్ల మా తాతల మతం నుండి."
"నో — నో — లేదు — లేదు — నహీ -- నహీ —!"
"సైలెన్స్!.... నిశ్శబ్దం ....!"
"అరవ మాకండి. బాధ్యత మరవబాకండి."
"కళ్ళలో ఎర్ర జీరలు తేబాకండి"
"అందరి తాతల మతాల నుండి ప్రారంభిద్దాం!"

"హియర్ ప్లీజ్! ఒక మనవి! అందరూ నే చెప్పినట్టు వింటేనే మీ మతాభిమానం నెరవేరేది. హిందువులంతా ఒక వరుసలో నిలవండి. ముస్లింలంతా నెక్స్ట్. అలాగే క్రైస్తవులు, బౌద్ధులు, శిక్కులు, జైనులు .... రైట్! నిలిచారు. బాగుంది. మీ మీ జెండాలను మీ గూండాల చేత ఎత్తిపట్టించండి. ఆ దూరంగా చెల్లాచెదురుగా నిలిచిందెవరు?"

[కోరస్‌గా] వారంతా మా మతాల్లోని అలగా జనం.

"వారిని మీలో నిలబెట్టుకోరా!"

"లేదు. ఓట్లప్పుడు వాళ్ళతో పని. ఇప్పుడవసరం లేదు. వారిని మాలో కలుపుకోం!"

"అలాగే! ఆ ...వెనుక నిలచినోళ్ళంతా దూరంగా జరగాలి. మీ రాజకీయ మత నాయకులకు మీ అవసరం ఇప్పట్లో లేదట. మీరు ఇళ్ళకు వెళ్ళిపోవచ్చు!

"ఓకే! ఇక పాయింట్ కొద్దాం!
మీరు చెప్పినట్లుగా - మీకు నచ్చినట్లుగా
ప్రాణి ప్రాణం పోసుకున్నప్పటి నుండి
నాగరికత పుట్టినప్పట్నుంచి
పాత రాతి యుగానికి ముందు నుంచి
మీ ఆత్మ గౌరవాలు దెబ్బ తినకుండా
మీ దేవుళ్ళకు దెయ్యం పట్టకుండా
చరిత్రను మళ్ళీ నిర్మిద్దాం! ....
(అందరూ పెద్దగా "అలాగే - అలాగే ....")

"అయితే వినండి. ఒళ్ళు దగ్గరెట్టుకుని - చెవుల్లోని చీలుం, మనసులోని కిలుం వదలిపోయేలా వినండి!" (పెద్దగా మరొక్కసారి)" వింటాం- వింటాం .. "

"మీరంతా గుడ్డ-లూడ దీసుకుని అరణ్యాలకు వెళ్ళండి!

"కోటానుకోట్ల వత్సరాల మానవచరిత్ర మొదలైంది అక్కడ! అక్కడ్నుంచి చరిత్ర మొదలవ్వాలి. మీకోరికమేరకు - పచ్చి మాంసం తినే దగ్గర్నుంచి, పాత రాతి యుగం నుండి చరిత్రను పునర్నిర్మిద్దాం. వెళ్ళండి .... వెళ్ళండి!"

# రాముడు, రాయి ఏదైతేనేం ...

తిండి లేక డొక్క ఎండుకుపోయే కోట్లాది మందికి
కూడు దొరుకుతుందంటే

గుండెల నిండా రామున్నే నింపుకొంటా
చదివిన చదువులు చట్టుబండలై
బతుకును బలి చేసుకొంటున్న
నిరుద్యోగుల కింత ఆసరా చూపిస్తే

నిత్యం రామకోటిని వ్రాసుకొంటా
వరకట్న కీలల్లో మాడి మసై పోకుండా
నా చెల్లెళ్ళను కాపాడ గలిగితే
అడుగడుగునా రామున్నే ప్రతిష్ఠిస్తా
ఇవన్నీ చేయ నప్పుడు, చేయ లేనప్పుడు
రాముడైతేనేం, రాయి అయితేనేం

వర్ణ అభిజాత్యాన్ని అణువణువున
నింపుకొని
సర్వ మానవ సమానత్వ మంత్రాన్ని
పెదవులపై జపిస్తూ
మానవత్వాన్ని అడ్డంగా నరికి, స్వాహా చేస్తూ
జీవితాల్ని ఛిద్రం చేసే మసీదు, మందిరం
ఏదైతేనేం
మత రక్కసి రూపాలుగా దాల్చినపుడు
మతం మనుష్యుల మధ్య అంతరాలు పెంచుతుంటే
మతం నిండు చూలాలి ప్రేగులను అలంకరించుకొంటుంటే

మతం చిన్ని పాపల బోసి నవ్వులను బలికొంటుంటే
మతం మనిషి మంచి కోసమని చెప్పే నంగనాచి కబుర్లు
వినాలంటావా !
ఒరేయ్ ! కసి కొద్ది అడుగుతున్నా
మనిషి అనే వాడు లేకపోతే
మట్టి దిబ్బల్ని ఏలుకొంటార్రా

—చిన్ని

# మతతత్వవాదం - ఒక పరిశీలన

—త్రి:

"మతములన్నియు మాసిపోవును;

జ్ఞాన మొక్కటె నిలిచి వెల్గును"

వంద సంవత్సరాలనాడు మహాకవి గురజాడ చెప్పిన ముత్యాల మాట. కాని జరిగిందేమిటి ? గిరీశాలు పాలకులయ్యారు. ప్రజలు వంచనకు గురైనారు. జ్ఞానమూ పెరిగింది. అంతకు వందల రెట్లు మతవ్యాప్తి జరిగింది. 'సర్వధర్మ భావన' పేరిట అన్ని మతాల ఛాందసత్వమూ, మూఢత్వం వ్యాప్తి చేయబడినవి. మతతత్వం వేయి పడగల విషంనాగై విషగ్రక్కుతుంది. డిసెంబరు 6 నాడు బాబరీ మసీదు హిందూ మతోన్మాదులచేత నేలమట్టం చేయబడింది. ఆ విధ్వంస చర్యను 'చీకటి రోజుగా', 'జాతికి సిగ్గు చేటుగా', 'సెక్యులరిజం హత్య'గా, 'గాంధీమరోసారిహత్య'గా పత్రికలూ, మేధావులూ, రాజకీయ నాయకులు పెదవి విరిచారు. 'వేయి పడగలు' నవలను హిందీ లోకి అనువదించిన బహుభాషా పండిత, కౌటిల్య రాజనీతివేత్త పి.వి. నరసిహారావు గారు ఏడ్చినంత పనిచేసి 'నమ్మకద్రోహం జరిగిం'దన్నారు. కాషాయాంబరధారుల ఫ్రంట్ 'జాతికి గర్వంగా, జరగవలసినది జరిగి'నట్లుగా, ప్రకటించి, ఆధిపత్యపు అహంకారాన్ని చాటుకున్నారు. కర్ఫ్యూలతో, సైనిక పారామిలట్రీ బలగాల కవాతు లతో, వేలాది మంది చావులతో, ధన, మాన, ప్రాణాల లూటీలతో దేశం అట్టుడికి పోయింది. దేశ విభజన నాటి పరిస్థితుల్లోకి దేశచరిత్ర వెనక్కి నెట్టివేయబడింది. నిషేధాలూ, ప్రాసిక్యూషనూ, అరెస్టులూ, ప్రభుత్వాల తొలగింపూ, నష్టపరిహారాల చెల్లింపులూ, సెక్యులర్ ఫ్రంట్‌ల ఏర్పాట్లు ఎజెండా పైకి వచ్చాయి. "దమ్ముంటే ఎన్నికలకు సిద్ధం కమ్మని' హిందూ మతోన్మాదం జూలుదులిపి సింహంలా గర్జిస్తుంది. అల్ప సంఖ్యాక వర్గ ప్రజలు విషాదంలోకీ, అగ్రహంలోకీ, నిరాశలోకీ, అభద్రత లోకీ నెట్టివేయబడినారు. సెక్యులరిజం పరిహాసం చేయబడింది. 'కుహనా సెక్యులరిజం' అని మతవాదులు ఛాలెంజి విసిరి, మెజారిటీవాదంతో రాజకీయాధికారం కోసం అర్రులు చాస్తూ, రాజ్యాంగ యంత్రపు భావజాలంగా, రాజ్యాధికార సిద్ధాంతంగా ముందుకొస్తున్నారు. దేశ చరిత్రలో మున్నెన్నడూ లేని కొత్త సవాలుగా మతతత్వ వాదం నేడు మనముందుంది.

సర్వసాధారణంగా మత కల్లోలాలు జరిగినపుడే మత తత్వం గుర్తుకువస్తుంది. మతతత్వం పెరిగి మత కల్లోల సంఘటనలు ఎక్కువైనా, ఎటువంటి కల్లోలాలు లేకుండా కూడా మతతత్వం విస్తరిస్తుంది. మత కల్లోలాలు తిరిగి మతతత్వం విస్తరించడానికి మరింత దోహదం చేస్తుంది. మతం, మతవాదం ఒకటి కావు. శాస్త్రీ యంగా వీటిని గతితార్కిక దృక్పథంతో విశ్లేషించకుండా, సమస్యను అర్థం చేసుకో

లేము. దానికి వ్యతిరేకంగా ప్రత్యామ్నాయ భావజాలాన్ని ఏర్పరుచుకోలేము. మతం అంటే ఏమిటి? మానవ నాగరికతా పరిణామంలో మతం ఒక నమ్మకంగా, ఒక విశ్వాసంగా జనించింది. మనిషికీ ప్రకృతికీ మధ్య వుండే సంక్లిష్ట సంబంధాన్ని వివరించే తాత్విక పరికరంగా అది రూపు దిద్దుకుంది. రానురాను వర్గ సమాజం అభివృద్ధి చెందుతున్న తరుణంలో వున్నత వర్గాల చేతుల్లో ఒక సాంస్కృతిక ఆయుధంగా మారింది. భారతదేశంలో బ్రాహ్మణమతం ప్రజల సాంస్కృతిక భౌతిక జీవనంలో నుండి పుట్టిన కర్మకాండల మీద నిర్మాణం జరిగింది. భౌతిక వుత్పత్తి శక్తులను పెరగనీయకుండా భూస్వామిక దోపిడీ సంబంధాలను కాపాడటంలో దోపిడి వర్గాలకు బలమైన సాధనంగా వుపయోగ పడింది. కొన్ని దశలలో మతాలు ఉద్యమంగా వ్యాప్తిలోకి వచ్చినవి. క్రైస్తవం, ఇస్లామ్, సిక్కు, బౌద్ధ తదితర మతాలు చారిత్రక కారణాల వలన ప్రగతిశీల ఉద్యమాలుగా తలెత్తినవి. ఆనాటి చారిత్రక నిర్దిష్ట పరిస్థితులలో శక్తి వంతమైన భావజాలాలుగా సామాజికోద్యమాలను నిర్మించినవి. కాల క్రమాన ఆ మతాలు అభివృద్ధి నిరోధక స్వభావాన్ని తమ స్వంతం చేసుకొన్నవి. అయితే మనం నేటికీ మతం శక్తివంతమైన భావజాల మనే సత్యాన్ని మరువరాదు. "మానవ సారాంశం వాస్తవీకరణ చెందని కారణాన, మతం అద్భుత సాక్షాత్కారంగా మానవ మానసిక ప్రపంచాన్ని ఏలుతుంది;.... మతం అంటే బాధను వ్యక్తీకరించడమే గాక, బాధలపట్ల ఆగ్రహాన్ని వ్యక్తీకరించే క్రమం కూడా; పీడిత మానవుని శ్వాసమతం హృదయంలేని ప్రపంచపు హృదయం మతం" - అన్నాడు కార్ల్ మార్క్స్. వర్గ సమాజము, దోపిడి కొనసాగి, శాస్త్రీయ విజ్ఞానం పెరగనంతవరకూ, నూతన మానవుని నిర్మాణం జరగనంత వరకూ మతం ఒక విశ్వాసంగా, ఒక భావజాలంగా ప్రజానీకంలో వుంటుంది. మతం ఒక 'తప్పుడు చైతన్యంగా', ప్రజలు తమను తాము విముక్తి చేసుకునే మార్గం నుండి దూరం చేయగల శక్తి కలిగి వుంది. ఆ పట్టునే దోపిడివర్గాలు తమ ప్రయోజనాలకోసం రాజకీయాలను మతానికి పులుముతారు. ఆ క్రమంలో 'మతతత్వం' ఒక భావజాలంగా రాజకీయ సామాజిక సిద్ధాంతంగా ప్రస్ఫుటమౌతుంది.

## మతతత్వం లేక కమ్యూనలిజం అనగా ఏమిటి?

మతతత్వం కూడా తప్పుడు చైతన్యమే; ఒక భావజాలమే. దీన్ని మేధావులు రకరకాలుగా నిర్వచించినారు. 'పాలకవర్గ రాజకీయ భావజాలం'గా కొందరు నిర్వచించారు. మతతత్వం అంటే మతం ఆధారంగా రాజకీయావసరాలకోసం ప్రజలను సమీకరించడం, మతం ప్రాతిపదికగా రాజకీయ కార్యాచరణను రూపొందించడం. అయితే మతాన్ని రాజకీయంగా వాడుకోవడానికి సామాజిక వ్యవస్థ అనుమ

( తరువాయి 38 వ పేజీ )

# త్త జాతీయ గీతం కావాలి

**1**

నేను భూమి లేని వాణ్ని
నన్నెక్కడికైనా తరిమేయ వచ్చు
ఇది ఏ కోర్టులోనూ
తల దాచుకోలేని నిజం
ఇది ఏ రాజ్యాంగంలోనూ
వంచింపబడని సత్యం
ఇది ఏ రాజకీయంలోనూ
నెగ్గలేని వాస్తవం
నేను భూమిలేని వాణ్ని
విశాలమైన ఆకాశం తప్ప
ఏ ప్రవక్తయినా
నా కోసం ఏం మిగిల్చాడని ?

**2**

అబద్ధంలాంటి జీవితం ముందు
అద్దంలాంటి నిజం ఎప్పుడూ పగిలిపోతూనే వుంటుంది
కోర్టులూ చట్టాలూ మోసపోతాయి
రాజ్యాంగాలూ రాజకీయ పీఠం కింద నలిగిపోతాయి
నన్ను బోనెక్కించండి
నా పేదరికం సాక్షిగా నిజం చెప్పలేను
నా నేల సాక్షిగా అబద్ధం దాచలేను
నా చిరిగిన వస్త్రాల్లోంచి
లోతుకు పోయిన ఆకలి దేహంలోంచి
నిజం వెన్నెముక ఎప్పుడో విరిగిపోయింది
సాక్ష్యం కావాలంటే
ఆకలి బోనులో నిలబడ్డ అమ్మినా
కళ్ళల్లోంచి పలకలేక వొలికిపోయిన
రక్తాశ్రువుని అడగాలి

**3**

అబద్ధం లాంటి వాస్తవం ముందు
అద్దం లాంటి ఆదర్శం ఎప్పుడూ మోసపోతూనే వుంటుంది

చిన్నప్పటి పాఠాలూ, ఆలోచనలూ నలిగిపోతాయి
ప్రవక్తలూ, తత్త్వవేత్తలూ అబద్ధాల కింద శిథిలమవుతారు.
నన్ను బోనెక్కించండి
నా చదువుల సాక్షిగా నిజం చెప్పలేను
నా పాఠాల సాక్షిగా అబద్ధమే చెప్పగలను
మీరు నాకు నేర్పిన పాఠాల నిండా
దాచిన విషం బహిరంగ సత్యమే కదా
మీరు నాకిచ్చిన సందేశాల నిండా
దాచిన అబద్ధం బహిరంగ నిజమే కదా
ఎన్ని పాఠాలు నేర్చుకున్నా
కళ్ళు విప్పని అంధుణ్ని నేను
అబద్ధాలు నిజం కాదని తెలిసీ
నిజమని భ్రమిస్తున్న వాణ్ని నేను
అవున్నిజమే
మీ దయాదాక్షిణ్యాల ఉదార జలాల్లో తప్ప
నేను పునీతుణ్ని కాలేను
నేను బతుకుతోంది
ఏ ఆకాశం కిందనో కాదనీ
నాది కాని భూమ్మీదనీ
ఇవాళ మరో పాఠం తెలిసింది

**4**

నేను భూమి లేని వాణ్ని
ఇది నా మాతృభూమి కాదు
నేనెవరికీ సోదరుణ్ని కాదు
ఇక్కడెవర్నీ నేను ప్రేమించలేను
ఈ ఉదయం అబద్ధం కాదు
మీ ప్రభాత భేరీలూ
  ప్రతిజ్ఞా గీతాలూ
  జాతీయ గీతాలూ అబద్ధం
అబద్ధం బద్దలు కానంత వరకు
నేను నిజంగా జాతి లేని వాణ్ని
నాకే జాతీయ గీతం లేదు

అఫ్సర్

ధారావాహిక వ్యాసం :

# సంస్కృతి : ప్రజాసాహితీ సాంస్కృతికోద్యమం
# భూస్వామ్య సంస్కృతీ రూపాలు
# కులాలు-బానిసత్వ భావన

**-జనసాహితి**

(సెప్టెంబరు 92 సంచిక తరువాయి)

ప్రజలందరూ సమానమైన సాంఘిక స్థాయి కలిగి వుండటం ప్రజా సంస్కృతిలో ఒక అంశంగా వుంటుంది. కాని వర్ణ వ్యవస్థ ప్రజలను నాలుగు భాగాలుగా విభజించింది. ఆవిధంగా ప్రజలను చీల్చింది. వారిలో ఉచ్చ, నీచాలనూ, అగ్ర, అధమ స్థాయిలను ప్రవేశపెట్టింది. తద్వారా వారిలో అనైక్యతను, ద్వేషాన్ని పెంచిపోషించింది. ఇది ప్రజావ్యతిరేక సంస్కృతి, ప్రజల్లో పరస్పర అవగాహననూ, స్నేహాన్నీ, సహకారాన్నీ, ఐకమత్యాన్నీ అభివృద్ధి చేయడం ప్రజాసాహితీ సాంస్కృతికోద్యమ కర్తవ్యంగా వుంటుంది.

వర్ణ వ్యవస్థలో బానిస వ్యవస్థ లక్షణాలున్నాయి. మొదట్లో ఏర్పరచిన నాలుగు వర్ణాలతోపాటు ఆ తర్వాత కాలంలో మరోవర్ణం—పంచమ వర్ణం సృష్టింపబడింది. ప్రసిద్ధ చరిత్రకారుడు ఆర్.ఎస్. శర్మ తన 'ప్రాచీన భారతంలో శూద్రులు' అన్న ఆంగ్ల గ్రంథంలో ఈ పంచమ వర్ణం - అస్పృశ్య వర్ణం-పుట్టుక గురించి-ఇలా చెప్పారు :

"అత్యంత అధమంగా వున్న ఆదిమవాసుల సాంస్కృతిక స్థాయీ, కాయ కష్టం పట్ల పెరుగుతున్న అయిష్టతా, అసహ్యమూ, కొన్ని కొన్ని పనులు అపవిత్రమైనవిగానూ, అస్పృశ్యత కల్గిస్తాయనే ఆలోచనల కలయికవల్ల ప్రత్యేక సామాజిక స్వభావం కల్గిన అస్పృశ్యత ఉద్భవించింది. 'క్రీ.పూ. 2000-క్రీ.శ. 400 మధ్య వచ్చిన స్మృతి వాఙ్మయంలో ఈ అస్పృశ్యతా భారం మొదటిసారిగా కనిపిస్తుంది.

**కులాల పుట్టుక :**

వేదకాలం ప్రారంభంలో అసలు వర్ణాలే లేవు. హరప్పా నాగరికత క్రీ.పూ. 3000-2000 నాటిది. ఒకే వృత్తి వారు ఒకే వీధిలో నివసించారన్న ఆధారంతో, అప్పటికే కుల విభజనకు ప్రాతిపదిక అయిన అంశాలు ఏర్పడ్డాయని కొందరు చరిత్రకారులు భావించడం అశాస్త్రీయంగా వుంది. ఎందుకంటే హరప్పా నాగరికత గ్రంథస్థం చేయబడిన రుగ్వేదంలో (క్రీ.పూ. 1490-1290) వర్ణాల, కులాల ప్రస్తావనేలేదు. ఆ తర్వాత రుగ్వేదంలో చేర్చిన పురుషసూక్తంలో నాలుగువర్ణాల వారు

బ్రహ్మ శరీరంలోని నాలుగు భాగాల నుంచి జన్మించారని రాసివుంది. ఈ సూక్తం రుగ్వేద యుగం ఆఖరురోజుల్లో-వర్ణ విపక్షతకు - వర్ణాశ్రమ వ్యవస్థకు ప్రాచీనత్వం ఆపాదించడానికి రుగ్వేదంలో చేర్చబడిందని చరిత్రకారులు తేల్చి చెప్పారు.

ఇక మధ్య యుగాలలో కుల వ్యవస్థ పూర్తి స్థాయిలో వ్యవస్థీకృతం చేయబడింది. భూస్వామ్య సంస్కృతిలో ఒక ప్రధానమైన అంశమైపోయింది. హిందూ మతంలో ముఖ్యమైన భాగంగా తయారైంది. కులాల సంఖ్య ఈ కాలంలో పెరిగిపోయింది. ఎన్నో ఉపకులాలుగా ఒక్కొక్క కులం చీలిపోంది. ఈ విషయాన్ని డి.డి. కోశాంబి 'భారత చరిత్ర-పరిచయవ్యాసాలు'లో ఇలా వివరించారు:

"ఆటవిక గణాలను స్వయం పోషక గ్రామ సమాజంలోకి కలుపుకునే క్రమంలో కుల వ్యవస్థ ఏర్పడింది. గణ వ్యవస్థలోని లక్షణాలు కులాలకు అంటుకున్నాయి. లైంగిక అంతర్నిషేధం, తెగల పూజావిధానం, ఆఖరికి పేర్లు వగైరా సైతం నిలిచే వుంటాయి. కాకపోతే కొన్ని ఆచారాలు, కర్మకాండ బ్రాహ్మణీకరణ చెందుతాయి.

"స్మృతులు పేర్కొన్న శూద్రులకూ తరువాత శూద్రులైన వాళ్ళకూ మధ్య గల తేడాను గమనించడం చాల ముఖ్యం. నాలుగు ప్రధాన 'వర్ణాల' మధ్య వర్ణ సంకరం జరిగిన పర్యవసానంగా కులాలు ఏర్పడ్డాయని మనువు కల్పించాడు. ఏమైనా ఆదిలో శూద్రుడుగా పేర్కొన్నవానికీ, తరువాత కూలీ నాలీ చేసుకునే కులాలన్నిటినీ కలిపి శూద్రులుగా పిలువబడ్డ వాళ్ళకూ మధ్య సంబంధమే లేదు. శ్రమ విభజన అపరిణితంగా వున్నపుడు నాలుగు వర్ణాలే సరిపోయాయి. తరువాత స్థిర వ్యవసాయ గ్రామాల సాంద్రత పెరగడంతో కొత్త పరిణామాలు వచ్చాయి. వర్తక శ్రేణులూ, వృత్తి శ్రేణులూ వచ్చాయి. స్వయం పోషక గ్రామాలకు ఆ చాతుర్వర్ణ్యం సరిపోదు. శూద్రుల సంఖ్య అపరిమితంగా వృద్ధి అయింది. చాతుర్వర్ణ వ్యవస్థ చట్రంలోకి కొత్త సమాజాన్ని ఎలా చొప్పించాలో తెలీక బ్రాహ్మణులు తికమక పడిపోయారు. వర్ణవ్యవస్థస్థానే కుల వ్యవస్థ ఏర్పడ్డా, కొత్త వ్యవస్థను పాత సూత్రాల వరవడిలోనే నిర్వచించే ప్రయత్నంలో చాతుర్వర్ణ్య విభజనను పట్టుకొని వేలాడుతూనే తామర తంపరగా వృద్ధిఅయిన అసంఖ్యాక కులాలకు అర్థాలు కల్పించారు.

"గణం నుంచి, శ్రేణుల నుంచి మాత్రమే కాకుండా వృత్తిని బట్టి, కులం రూపొందిన ఉదాహరణలున్నాయి. కాయస్థులు రాజుల వద్ద రాయసగాళ్ళుగా వుండే వాళ్ళు. వాళ్ళు మొదట విభిన్న కులాల నుంచి వచ్చినవారు. క్రమేణా ఒక కులంగా రూపొందారు. ఈ కులాల చట్రం బిగుసుకు పోవడానికి నూతన ఉత్పత్తి ప్రాతిపదిక కారణం". (పేజీలు 38, 39, 40).

మనుధర్మ శాస్త్రం ప్రకారం బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, కులాల వారు ద్విజులు. అంటే తల్లి గర్భం నుంచి జన్మించడం మొదటిసారి కాగా, తర్వాత ఉపనయనం ద్వారా మరొక సారి జన్మిస్తారు. ద్విజులు అంటే రెండవసారి జన్మించిన వారు అని అర్థం శూద్రులు అద్విజులు, శూద్రులు పై మూడు కులాల వారి లాగా విద్యా వ్యాసంగం చేయడానికి వీలులేదు. అగ్ర కులాల వారికి సేవ చేయడమే వారి కర్తవ్యం. వీరు ఆస్తిగాని, ఆయుధంగాని, జ్ఞానం గాని కలిగి వుండరాదు. పై మూడు కులాల వారికి ఒక రకమైన శిక్షా స్మృతి, శూద్రులకు మరొక రకమైన శిక్షా స్మృతి నిర్ణయించారు.

ఆనాటి మేధావి వర్గం తమ శారీరక శ్రమను పూర్తిగా తగ్గించుకొని, ఇతరుల శ్రమపై ఆధారపడి ఆనందంగా జీవించడానికి చేసుకున్న ఏర్పాటే ఈ కుల వ్యవస్థ. డి.డి. కోశాంబి మాటల్లో, "వృత్తిపరంగా, తెగ పరంగా ఏర్పడిన కొత్త కులాలలో పురోహిత కార్యక్రమాలను బ్రాహ్మణులు తమ సొంత పద్ధతుల్లో నిర్వర్తించేవారు. తెగల *ఆచారాలను శాస్త్ర నాగరికంగా మార్చేవారు....జననం, మరణం, వివాహం, సీమంతం, ఉపనయనం లాంటి ఆచారాలను బ్రాహ్మణులు మాత్రమే జరిపించగలరు. విత్తనాల సమయంలో పంటలను ఆశీర్వదించడానికి బ్రాహ్మడే కావాలి. దయ్యాలు వదిలించడానికి, దేవతల ఆగ్రహాన్ని తగ్గించడానికి, రుతుగతులు (పంచాంగం) చెప్పడానికి బ్రాహ్మడే కావాలి.... వ్యవసాయక, వ్యాపార కుటుంబాలు పాల్గొనే కర్మకాండ వల్లనే బ్రాహ్మణుడికి నాలుగు డబ్బులు గిట్టేవి. బ్రాహ్మణులు ఆ కులం, ఈ కులం అనకుండా అందరి ఇళ్ళల్లో ఈ పనులు చేసేవారు. ఈ పనులు చేయించుకునే వారు బ్రాహ్మణులను గౌరవించి, పురోహితునికి దక్షిణ ముట్ట చెప్పగలిగితే చాలు."

శంకరాచార్యుడు (క్రీ. శ. 7, 8 శతాబ్దాలు) అద్వైత సిద్ధాంతం ప్రకారం కుల భేదాలు పాటించడం సమర్థనీయం కాదంటూనే, అంతటి అద్వైత సిద్ధి లభించేంత వరకూ లోక వ్యవహారాలకు కట్టుబడి వర్ణాశ్రమ ధర్మాలను పాటించి తీరాలన్నాడు. ఈనాటికీ దేశం నాలుగు మూలలా ఆయన స్థాపించిన పీఠాలకు సంబంధించిన, కంచి, శృంగేరీ మొదలైన పీఠాధిపతులు ఇదే సూత్రాన్ని వల్లెవేస్తూ, వర్ణాశ్రమ ధర్మాలనూ, అస్పృశ్యతను సమర్థిస్తూ ప్రకటనలిస్తూ వుంటారు. ఇది రాజ్యాంగం ప్రకారం నేరమే అయినా ఈ శంకరాచార్యులను అంటరానితనం ప్రచారం చేస్తున్నందుకు అరెస్టు చేయడానికి ప్రభుత్వం భయపడుతుంది.

ఈ కులాల పిచ్చి ఏ దశకు వెళ్ళిందంటే ప్రతి కులంలోనూ మరల ఉపకులాలు [illegible] ఏర్పడ్డాయి. ఉదాహరణకు బ్రాహ్మణుల్లో రెండువందల పైన ఉపకులాలున్నాయట! మండల్ కమీషన్ లెక్కల ప్రకారం వెనుకబడిన

* పౌరోహిత కర్మకాండ — వ్యాసకర్త॥

కులాలు ఐదు వేలు వున్నాయి. హరిజనులలో 63 ఉప కులాలున్నాయి. ఒక్క మాదిగ కులంలోనే 25 ఉప కులా లున్నాయి. ఆంధ్రలో 350 పైగా కులాలున్నాయి. దేశం మొత్తంలో 2000 పైగా కులాలు, ఒక లక్షకు పైగా ఉపకులాలు వున్నాయి.

అస్పృశ్యులలోనే అంటరానితనం వుండటం ఈ కుల రక్కసి దుర్మార్గానికి పరాకాష్ట! ఈ కులంలో పుట్టి, కవిత్వం -సిన గుర్రం జాషువా, అస్పృశ్యత గురించి రాసిన ఈ క్రింది పద్యాలు ఈ సందర్భంగా జ్ఞాపకం చేసుకోవడం ఉచితంగా వుంటుంది :

* "చిత్రము దేవరా" యనుచు జెప్పిన మాటకు దాటిపోక, నీ
యెత్తిడి కేడు కోట్ల జన మోర్చుచునుండె ననాది నుండి యున్
బెత్తెడు భూమి లేని నిరుపేదలమై, యిటు లంటు దోషమన్
గత్తుల బోనులోన గలకాలము గ్రుళ్ళి కృశింప మందువా ?

* హిందూ మతంలోని అంటరానితనాన్ని వదిలించుకోడానికి క్రిస్టియన్ మతంలో చేరినా, ఆ మతంలో కులాలను ప్రవేశపెట్టిన ఘనత మన కుల వ్యవస్థకు వుంది. దీనిని విమర్శిస్తూ జాషువా -

"వాని గుడిసె మీద వాలిన కాకి, నా
గుడిసె మీద వాల గూడ దెపుడు;
కాకులందు మాల కాకి మాదిగ కాకి
రూఢి సేయు మా విరోధములను"

'గబ్బిలము' కావ్యంలో జాషువా ఇంకా ఇలా అంటున్నారు :

"పామునకు బాలు, చీమకు పంచదార
మేపు కొనుచున్న కర్మ భూమిం జనించు
ప్రాక్తనంబైన ధర్మ దేవతకు గూడ
నులికి ఏడు జబ్బు గలదు వీడున్న చోట :

ఆ యభాగ్యుని రక్తంబు నాహరించి
యినుప గజ్జెల తల్లి జీవనము సేయు
గసరి బుసకొట్టు నాతని గాలి సోక
నాల్గు పడగల హైందవ నాగరాజు."

జాషువాకు సమకాలికుడు విశ్వనాథ సత్యనారాయణ. హైందవంలోని వర్ణాశ్రమ ధర్మాలనూ, మను ధర్మ శాస్త్రాన్నీ, సంప్రదాయ ఛాందసత్వాన్నీ సమర్థిస్తూ విరివిగా ఆయన రచనలు చేశారు. హిందూ ధర్మాన్ని వేయిపడగల పాముగా వర్ణిస్తూ "వేయి పడగలు" అనే నవల రాశారు. ఈ నవలలో స్పష్టంగా విశ్వనాథ, భూస్వామ్య సంస్కృతిలో భాగంగా వున్న మతం, పునర్జన్మ, పూర్వజన్మ, మోక్షం,

కర్మ, పాప పుణ్యాలూ, కర్మ సిద్ధాంతం, వర్ణాశ్రమ ధర్మాలూ మొదలగు వాటిని సమర్థిస్తూ కుతర్కంతో వింత వాదనలు సృష్టించారు.

**బానిసత్వ భావన :**

అంటరాని వారిగా ముద్రవేయబడిన ప్రజలు బానిసలుగా, కూలీలుగా కొనసాగుతూ వుంటే, శూద్రులు కొందరు వ్యవసాయదారులుగా, భూస్వాములుగా, జమీందారులుగా, చివరకు రాజులుగా ఎదిగారు. ఆ విధంగా అగ్రకులాలుగా ఎదిగిన కులాలతో సహా, శూద్ర కులాల వారందరిలోనూ తాము సమాజంలో ద్విజులకంటే తక్కువ వారమనే భావం కొనసాగుతోంది. కొందరైతే తమంతట తామే బ్రాహ్మణిజం సృష్టించిన అగ్ర, నీచ స్థాయిని అంగీకరిస్తారు. తాము బ్రాహ్మణులను అంటుకుంటే పాపమని బిడియపడతారు. తామే ప్రక్కకు తప్పుకొని పోతుంటారు. ఎవరైనా అగ్ర కులం వారు వచ్చి అన్నం అడిగితే, వారికి తమ ఇంట్లో అన్నం పెడితే తమకు ప్రమాదమని తలుస్తారు! ఈ ద్విజులు శూద్రులను బూతులు తిడుతూ పిలిచినా, అవమానించినా వాటిని భరిస్తూ పడి వుండాలనుకుంటారు. యజమానిని 'అయ్యగారు, దొరగారు' లాంటి పదాలతో గౌరవిస్తూ, తమ బానిసత్వ భావజాలన్ని ప్రదర్శిస్తుంటారు. పై అధికారుల పట్ల అనవసరమైన భయభక్తులను చూపిస్తుంటారు. వారిని సంబోధించేటప్పుడు - "ఘనమైన అయ్యా .... వారి దివ్య సముఖమునకు" మొదలైన పదాలు వాడతారు. తోటి మనిషి పట్ల మర్యాద, గౌరవం చూపించటం అవసరమే. కాని తమ వ్యక్తిత్వాన్ని చంపుకొని, ఆ మనిషి ముందు మోకరిల్లిడం, అతనికి బానిసగా వుండటం భూస్వామ్య సంస్కృతి నేర్పిన అలవాట్లు.

**సంస్కరణలు — ఉద్యమాలు:**

వర్ణాలనూ, కులాలనూ, కర్మసిద్ధాంతాన్నీ, ఇతర అశాస్త్రీయ సిద్ధాంతాలనూ, బానిసత్వాన్నీ మొట్ట మొదటగా ప్రతిఘటించిన వారు లోకాయతులు (చార్వాకులు) వీరు చేసిన పోరాటాలు బౌద్ధానికి నేపథ్యాన్ని సృష్టించిపెట్టాయి. వీరశైవ ఉద్యమం చివరకు లింగాయతులు, జంగాలు అనే కులాలను సృష్టించింది. మధ్యయుగాలలో భక్తి ఉద్యమం కుల వ్యవస్థను వ్యతిరేకించింది. బ్రహ్మనాయుడు, వేమన, వీర బ్రహ్మం కులాలను నిరసించారు. బ్రహ్మం, ఆయన ముస్లిం శిష్యుడు సిద్దయ్య కుల పిచ్చిగాళ్ళ గురించి చెపుతూ ఇలా అన్నారు:

"ఏమని చెప్పుదు లోకులకూ -పలుగాకులకూ/ఏ కులమని నన్నివరమడిగితే
దుర్మార్గులకూ - ఈ దుష్టులకూ...."

ఆధునిక కాలంలో కుల వ్యతిరేక ఉద్యమంలో జ్యోతి బాఫూలే, డా॥ అంబేద్కర్‌లు కృషి చేశారు.

సంస్కరణ ఉద్యమాలు కుల రక్కసిని మూలమట్టంగా మట్టుపెట్టలేవు. వాటి లక్ష్యం, సంస్కరించడం మాత్రమే. ఇవి మహా ఐతే కులతత్వాన్ని తగ్గించగలుగు

తాయి. ఆ మేరకు జరిగినా సంస్కరణ ఉద్యమాలు పాజిటివ్ ఫలితాన్ని సాధించినట్లే.

**మన కర్తవ్యం :**

ఈ కుల వ్యవస్థ ప్రజల్లో అనైక్యతను పెంచుతుంది. పుట్టుకతోనే కొందరు అధికులు, మరికొందరు అధములు అనే అశాస్త్రీయ భావజాలాన్ని ప్రచారం చేస్తుంది. బానిసత్వ భావనను పెంపొందిస్తుంది. అగ్రవర్ణమైన బ్రాహ్మణవర్గం అశేష ప్రజానీకాన్ని తన చెప్పుచేతల్లో వుంచుకోడానికి ఈ వ్యవస్థను సృష్టించింది ఇటువంటి విభజన అశాస్త్రీయం. కనుక కులాలను మనం దర్శించనక్కర్లేదు. ఎవరిది ఏకులం అని తెలుసుకోడానికి ప్రయత్నించనక్కర్లేదు. ఒకవేళ కాకతాళీయంగా తెలిసినా దానిపై ఆధారపడి ఎటువంటి నిర్ణయాలు తీసుకోకూడదు.

ఒకే కులంలో పెళ్ళి చేసుకోవాలనే నిబంధన కూడా కులవ్యవస్థలోని భాగమే. దీనిని పాటించాల్సిన అవసరంలేదు. ఒకే కుటుంబంలోని దగ్గర రక్త సంబంధీకులకు (అన్న-చెల్లి) వివాహం వల్ల రకరకాల వ్యాధులు రావచ్చునని సంప్రదాయ వాదులు నిషేధించారని చెప్తారు. ఇది శాస్త్రీయమైతే మేనరికాలు చేసుకోక పోవడమూ శాస్త్రీయమే. మేనగోడళ్ళను చేసుకోవద్దని - బావ, మరదళ్ళ వివాహం వివిధ జన్యు సంబంధమైన వ్యాధులను తెచ్చి పెడ్తుందని డాక్టర్లు చెప్తున్నారు. ఇదే వాదనను పొడిగిస్తే ఒకే కులంలో వివాహం చేసుకున్నా, కొన్ని వ్యాధులు రావచ్చు గనుక వేరే కులంలో చేసుకోవడం ఉత్తమం అని శాస్త్రీయంగా చెప్పవచ్చు.

కేవలం కులాన్ని పట్టించుకోక పోవడం వల్లగానీ, వర్ణాంతర వివాహాల వల్లగానీ ఈ కులరక్కసి అంతం కాదు ఈనాటి సమాజంలో అడుగడుగునా ఈ కులం తాండవ నృత్యం చేస్తోంది. సమాజ జీవితం కుల కల్మషంతో నిండిపోయింది. రాజకీయాలు కులాల కుమ్ములాటగా మారాయి. ఎప్పుడు ఏ కులం పేరుతో ఉద్యమం ప్రారంభమౌతుందో నని ప్రజలు భయపడే వాతావరణం వుంది. ఆదర్శాలకు అంకితమై, అభ్యుదయ దృక్పథం అలవర్చుకోవాల్సిన యువకులు - విద్యార్థులు కులాల వారీగా చీలిపోతున్నారు. తమ కులం నాయకుడికి ఎటువంటి ఆపద వచ్చినా, తమ ప్రత్యర్థి కులానికి చెందిన అమాయక ప్రజల ఆస్తిపాస్తులు దోచుకోవడం, తగలబెట్టడం చేస్తున్నారు. దేశ ఆర్థిక పరిస్థితి దిగజారుతున్న ఫలితంగా, ప్రజలు ఆర్థిక దుస్థితిలో కొట్టుమిట్టాడుతూ వుండటం చేత, రిజర్వేషన్ సౌకర్యం అనుభవిస్తున్న కులాలవారి పట్ల, రిజర్వేషన్ సౌకర్యం లేని పేదవారికి ద్వేషం, అగ్రహం కలుగుతున్నాయి. తమనుకూడా అ రిజర్వేషన్ కేటగిరీలోకి చేర్చమని విజ్ఞప్తి చేస్తున్నారు.

కొన్ని అగ్ర కులాల వారు కులసేనలు (ప్రైవేట్ ఆర్మీ) ఏర్పాటు చేసుకొని నిమ్న వర్గాల వారిపై దాడులు జరపడం .... దీని ఫలితంగా దళితులు తమ సేనలు ఏర్పరచుకోవాలని ప్రయత్నించడం — ఇలా దేశమంతా కులాల కుంపటిగా మారిపోయింది.

[ఇంకా ఉంది]

# ఓరి మతోన్మాది

ఓరోరి మతోన్మాది
నీకు కడతాముర మేము గోరి-అనె- ॥ఓరోరి॥
కులము పేరట నీవు కుట్రలే జేస్తావు -
మతము పేరిటనేమో మంటరాజేస్తావు !
రామరామంటావు నామాలు బెడతావు -
అన్నదమ్ముల మధ్య చిచ్చు బుట్టిస్తావు
కోతిమూకను లేపి ధ్వంసాలు జేస్తావు
వేలాది ప్రాణాలు బలిగొంట నంటావు.... ॥ఓరోరి॥
రామొడొక్కడి కేమో గుడిగడత నంటావు
రహీమ్ మజీదు కూల్చిపారేస్తావు
రాక్షస దండునె దాసులుగ జేస్తావు
కల్లోలమే లేపి కలత బుట్టిస్తావు
అయ్యయ్యో రామని అరుపులే బెడతావు
శవాల ప్యాలాల నేరుకొని తింటావు........ ॥ఓరోరి॥
మనిషిలో లేనోడు మందిరం లుంటాడ -
ప్రక్కోని ఇంటినె గూల్చేయ మంటావా !
దేవుడనోడికె బుద్దెట్ల లేదురా -
దేశంలో వేలాది గుళ్ళు వాని కున్న -
అయోధ్య నగరంలో గుడి వాని కెందుకుర !.. ॥ఓరోరి॥
పేదోని గుడిసెలు ఊడదీకిస్తావు -
కనబడని రామునికి గుడిగడత నంటావు !
వాడి పేరు జెప్పి నీవు దోపిడి జేసి -
అద్దాల మేడలే గట్టు కున్నావురా !
పాపం పుణ్య మంటు ప్రజలనే దోస్తావు -
దొంగపూజ లేమొ రామునికి జేస్తావు........ ॥ఓరోరి॥
దేశంలో ఆకలి బాదలెన్నో పెరిగి -
కూటికి లేనోళ్ళు ఆవురావురు మంటు :
ఎంగిలి స్తరులేమొ ఏరుకొని తింటుంటె -
కుక్కలోలె వాళ్ళు బతుకులెల్ల దీస్తుంటె!
పట్టె డన్నం బెట్టి ఆదుకోనోడివి -
కనబడని రామునికి కట్నాలు బెడతావు...... ॥ఓరోరి॥
( తరువాయి 37 వ పేజీ )

# ప్రజా కవిత్వానికి గీటురాయి సారళ్యతే

**— పరజ**

'కాదేది కవితకనర్హం' అన్న శ్రీశ్రీ వాక్కుల్ని, ఆయన వారసత్వాన్ని కొనసాగిస్తున్న ప్రజారచయితలు, కవులు నిత్య జీవితంలోని, ముఖ్యంగా నిరుపేద-దైనందిన జీవితాల్లోని అనేకానేక వస్తువుల మీద- చిన్నవి దగ్గర్నుంచి పెద్దవిదాకా అద్భుతమైన కవిత్వం చెప్పవచ్చు అనే దానికి నిదర్శనం ఈ గాజు గ్లాసు కవిత. మనందరం ఎన్నోసార్లు చావిడిలో గూళ్ళలో బోర్లించిన పాత, పగుల్లు దీసిన, నల్లబడి మసక బారిన గాజు గ్లాసుల్ని చూసే వుంటాం. కానీ పనికి రాదేమోనని భ్రమించే ఆ వస్తువు ఈ కవితలో ఎట్లా కవిత్వమయిందో చూడండి. నిజానికి గ్రామీణ జీవితం అనుభవిస్తున్న వాళ్ళు తాము నిత్యం చూపే ఒకానొక గాజు గ్లాసు గురించి 'దాని చుట్టూ అల్లుకు పోయిన జీవితం గురించి' ఆ జీవితంలోని శూన్యం గూర్చి, ఎన్నడూ నిండని తనం గూర్చి, ఇంటిల్లిపాదీ ఎంగిలి గ్లాసులు కడిగితే నీళ్ళు చల్లి తీసుకునేవాళ్ళు ఆ కడిగినవాడికోసం ప్రత్యేకంగా ఎవరూ ముట్టని గ్లాసుని ఏర్పాటుచేసే ఫ్యూడల్ తత్త్వం గూర్చి ఎంత అద్భుతంగా చెబుతుందీ కవిత. ప్రజా కవిత్వంలో, ముఖ్యంగా పోరాడుతున్న పీడిత ప్రజానీకం కోసం రాసే కవిత్వంలో, సారళ్యం (simplicity) ఎంతో అవశ్యకం. దీంతో ఏకీభవించని వారు చాలా మందే వున్నారు. నగరజీవితాన్నీ, సంక్లిష్ట జీవనాన్నీ, పై రుధ్యాలనీ, జీవుడి అస్తిత్వ వేదననీ పరాయీకరణనీ పట్టుకో ప్రయత్నించే కవులు నిజానికది అనుభవించి రాయకపోవడంవల్ల, అనుభవించినా అనుభవానికందినది సమగ్రంగా ఎన్నడూ అర్థం కాలేదు కనుక, సారళ్యంగా కవిత్వం రాయలేకపోయారు. వొక విషయం పట్ల గాఢంగా అనుభూతి చెందితే, ఆ వస్తువు కవినంతగా ప్రభావితంచేస్తే, ఆ వస్తువును కవి క్షుణ్ణంగా అర్థం చేసుకుంటే దాన్ని ఎంత సరళంగా చెప్పినా అది కవిత్వమయ్యే స్థాయిలోనే చెప్పగలరనేది సావిత్రి 'బందిపోట్లు' కవితనుండి ఈ కవిత దాకా ఎన్నో ఉదాహరణలివ్వొచ్చు. నక్సల్బరీ అనంతర దేదీప్యమాన సాహితీ దశాబ్దం కొంత వురుకులు పరుగుల్లో కవిత్వాన్ని మర్చిపోయినా తర్వాతి కాలం అద్భుతమైన, బాగా ఎదిగిన, వొక గంభీరమైన సెలయేటి ప్రవాహ చందాన్ని పుణికి పుచ్చుకున్న గాఢమైన కవిత్వాన్ని అందించింది, అందిస్తోంది. దానికి కొనసాగింపే ఈ కవిత. ఇందులో విమర్శకులు చెప్పే భాషాశాస్త్ర సూత్రాలూ, సౌందర్యాలంకార సూత్రాలూ వున్నాయో లేవో తెలీదుగానీ, జీవితం వుంది. అంటరాని దళిత జీవన ఘోషవున్నది. ఆ ఘోషనూ, పీడననూ, పీడనలోపడి నలిగిన జీవితాలు తమ పీడకుల్ని శపించి పోరుబాట పట్టే క్రమాన్ని ఈ కవిత పట్టుకుంది. దీన్లో వున్న

మరో రెండు ముఖ్యాంశాలు-మన జానపదులకున్న మౌఖిక సంప్రదాయమూ (oral tradition) కథ చెప్పే పద్ధతి (story telling element) అనే ఈ కవితను శక్తి వంతం చేస్తున్నాయి.

"చూడండి-ఆ గ్లాసు నా కోసం ఓ మూల చావిట్లో బోర్లించే వుంటుంది" అని ప్రారంభమైన కథనం అల్లా బోర్లించిన గ్లాసు కథ చెప్తున్న దళితుడి అంటరాని తనానికి ఎట్లా ప్రతీకగా వుందో కథా గమనంలో చెబుతూనే, గ్లాసు ఫ్యూడలిజానికి, తరతరాల భూస్వామ్యా హంకారానికి ఎట్లా చిహ్నమో చెబుతూ చివర్న ఆ చావిడి కూలిపోవాలనే కథకుడి శాపనార్థంతో ముగుస్తుంది. ఒక కథకు కావాల్సిన థీమ్ వున్నది ఘటనల్లేక పోవచ్చు, ఘటనలూ చెబితే అది వృత్త కథే అవుతుంది. కథచెప్పే ధోరణీ వున్నది- కథకుండాల్సిన బిగి (tempos) వున్నది. అంచేత ఇది ఒక అసాధారణ కవితగా పరిణమించింది.

ఇహ పోతే కవిత కుండాల్సిన అనుభూతి గాఢతా వున్నది - దళితుడి గొంతే ఒక గాఢమైన అనుభవానికి ప్రతీక. కవితలో వుండాల్సిన ఇమేజరీలు పుష్కలంగా వున్నాయి కూడా. "అంచులు పగిలి...నాలాగే....మసకబారి, నా కడుపులాగే ఎన్నడూ నిండదు"...నాలాగే బోర్లించి వుంటుంది. మసకబారిన పారదర్శకత నా జీవితం లాగే....అట్లా ఒక అద్భుతమైన పదచిత్రాల సమాహారంలో మన ముందు గ్లాసు వాక దృశ్యమై, ఒక జీవితమై, తరతరాల వ్యవస్థఅయి, ఫ్యూడల్ అహంకారమై, పీడితుని ఆత్మ ఘోషై - అట్లా సాదృశమవుతూ మనని కుదిపేస్తుంది.

అయితే అట్లాగని కవితలో లోపాల్లేవని కాదు - పారదర్శకత, తరతరాల అహంభావం, భూస్వామ్య భావజాలం, వగైరా మాటలో కథకుడైన దళితుడు కాకుండా కవి ప్రవేశించాడు. అందుకే జీవితానికి సంబంధించిన కవిత్వానికి బదులు డైడాక్టిక్ (బోధన చేసే) పదాలూ, వాక్యాలూ దొర్లినయి. అట్లాకాకుండా దళితుడే భూస్వామ్య అహంకారాన్నీ, గ్లాసు మసబారిన పారదర్శకతనూ ఏమనుకుంటున్నాడో ఆయన భాషలోనే ఆయన ఎక్స్‌ప్రెషన్‌లోనే చెప్పి వుంటే కవిత మరింత బలమైందిగా తయారయ్యేది.

ఇప్పుడిప్పుడే కవిత్వం రాస్తున్నా, కొన్ని ఏండ్లుగా కవిత్వం రాస్తూ ఇప్పటికీ సారళ్యత పట్టుపడక సంక్లిష్టంగా రాసే అనేక కవులకన్నా గోపాల్రావు కృషి మెచ్చుకోదగిందే అయితే ఈ మెచ్చుకోలుగానీ, విమర్శగానీ గోపాల్రావు మరిన్ని కవితలు ఇట్లా రాయాలనే గానీ ఇప్పుడే నడ్డి విరిగి మూలన పడాలని కాదు. సుబ్బారావుపాణిగ్రాహి, చెరబండరాజు, అంజయ్య, గద్దర్, తదితర ప్రజా రచయితల వారసత్వాన్ని మరింతగా గోపాల్రావు ముందుకు తీసుకెళ్ళాలని ఆశిస్తూ, ఇట్లాంటి కవిత్వ శైలిని తనదిగా చేసుకొమ్మని అర్థిస్తూ....

# గాజు గ్లాసు

ఆ గ్లాసు
నా కోసం
చావిడిలో వో మూల
బోర్లించే వుంటుంది
నీళ్ళకైనా
చాయ్‌కైనా
అన్నింటికీ నా కోసం
వొంటరిగా........
వీళ్ళ యింటిల్లిపాదీ
యెంగిలి గ్లాసులు
కడగి బోర్లిస్తే
నీళ్ళు చల్లి తీసుకుంటారు -
కాని
నా గ్లాసు అంటరానిది ? !
ఆ గాజు గ్లాసు
నాలాగే
అంచులు పగిలి
మసకబారి —
పగుళ్లు దీసి పాతబడిన
ఆ గ్లాసు
నాలాగే
అంటరానిది
అది యెప్పుడూ బోర్లించే వుంటుంది.
ఒక్కపూటైనా నిండుగా నిండదు
నా కడుపులాగే —
ఆ గ్లాసు మసకబారిన పారదర్శకత
నా జీవితంలాగే........
ఆ గ్లాసు పగిలిపోను !
యెంతకూ పగలదే ?
పగిలినా
ఇంకో పాతగ్లాసు

వారికి పనికిరానిది
వారు వాడుకోనిది
ఆ గూటిలో బోర్లించే వుంటుంది
ఆ గ్లాసు
వారి తరతరాల అహంభావానికి చిహ్నం
వాళ్ళ భూస్వామ్య భావజాలానికి గుర్తైన ప్రతీక
నా గ్లాసు
వొక్కటే కాదు
మొత్తం గాజు గ్లాసులన్నీ పగిలిపోను !
ఆ గూళ్ళన్నీ పూడి పోను ! !
ఆ చావిడీలు కూలిపోను !!!

—అప్పన్నగారి గోపాలరావు

---

( 33 వ పేజీ తరువాయి )

మానవత్వమె నీవు మంటల్లో గలిపేసి -
భజన కీర్తన జేస్తే పాపాలు బోవురా !
రాతి బొమ్మల ముందు దీపాలనె బెట్టి -
రాత ఖర్మలంటె బతుకేమి మారదుర !
పురాణ శాస్త్రాల సుత్తినీవు గొట్టి -
మధ్యయుగాలల్లో బతుకంట వేందిరా........ ॥ఓరోరి॥
మతము మత్తెక్కిచ్చి కులము కుళ్ళును బెంచి -
అంటరానోడని దూర ముండంటావు !
మతమేమి నేర్పెరా కులమేమి జెప్పెరా -
మనిషిలో మనిషికి బేదాలు బెంచెరా !
మతము మాటున నీవు దాగుంట వేందిరా -
మారణ హోమాన్ని సృష్టిస్త వేందిరా........ ॥ఓరోరి॥
కులమంటు లేదురా మతము మాకొద్దురా -
భూమి భుక్తి కొరకు పోరు జేస్తాముర !
మత పిచ్చి గాళ్ళను మంటల్లో దోసేసి -
కుల పిచ్చి గాళ్ళను ఊశెల్ల గొడతాము !
ప్రజల ముంచేటోళ్ళ పగబట్టి తంతాము -
అపాటి కినకుంటె అంతమె జూస్తాము........ ॥ఓరోరి॥

—ఎం.జి.ఎం.

( 24వ పేజీ తరువాయి )

తించాలి. మతతత్వం సమాజంలో భిన్న స్థాయిలలో పనిచేస్తుంది. వ్యక్తుల సంబంధాలలో స్థానిక ప్రయోజనాలలో, సంస్థలలో, జాతీయ రాజకీయాల్లో వివిధ స్థాయిలలో మతతత్వం వ్యాప్తిచెంది పనిచేస్తుంది. దాని శక్తి పెరిగినప్పటి దశలో రాజ్యంలో మెజారిటీ ప్రజల చైతన్యంగా వుంటుంది. రాజ్యాధికారం పొందేందుకు శక్తివంతమైన సాధనమౌతుంది. కేవలం రాజకీయ అధికారం కోసం మాత్రమే గాక, రాజకీయ, సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక రంగాల్లో, మొత్తం సామాజిక నిర్మాణంలో మతవాదం ప్రధాన భావజాలంగా వుంటుంది. దోపిడి వర్గాలకు ప్రయోజనం కూర్చి, పీడిత ప్రజలకు భూతంగా పరిణమిస్తుంది. అల్ప సంఖ్యాకులను గుర్తించదు. పీడిత ప్రజల హక్కులను నిరాకరిస్తుంది. మానవ విలువలకు స్వేచ్ఛా సమానత్వాలకూ శత్రువు. రాజ్యం 'పరమ భావన'గా గుర్తించే విద్య, సాంస్కృతిక, కళావిలువలను చట్టపరంగా బలవంతంగా రుద్దుతుంది.

సామ్రాజ్యవాద యుగంలో దాని దోపిడికి గురయ్యే ఏ దేశంలోనూ స్వతః సిద్ధ పెట్టుబడిదారి వ్యవస్థ అభివృద్ధి చెందలేదు. భారతదేశంలోనూ బ్రిటిష్‌వారి ఆధునిక పరిశ్రమలూ చట్టబద్ధ పాలనా, మార్కెట్టూ, ఫ్యూడల్ ప్రాపంచిక దృక్పథం ప్రభావానికి లోనై, దాని వెలుగులోనే పని చేశాయి. ఆంగ్లేయులు భారతీయ సమాజాన్ని హిందూ, ముస్లిం సమూహాలుగా చూశారు. భారతీయ చరిత్రను జేమ్స్‌మిల్ హిందూ యుగం, ముస్లిం యుగం, ఆధునిక యుగంగా వర్గీకరించాడు. భగవద్గీత, మనుధర్మశాస్త్రాలను హిందూ సమాజానికంతటికీ వర్తించే పవిత్ర గ్రంథాలుగా భావించారు. భారతీయ సమాజాన్ని ఆధునీకరించేందుకు తాము దైవకార్యం నెరవేరుస్తున్నట్లు ఆంగ్లేయులు తాము అధికులుగా, భారతీయులను అల్పులుగా భావించే క్రమంలో, జాతీయోద్యమంలో తిలక్ నుండి రాజకీయ సమీకరణకు మతం వాడుకునే ధోరణి ప్రారంభమైంది. గత చరిత్రలో తాము గొప్ప వైభవ సామ్రాజ్యాలు కలిగిన వారమనీ, తమ తత్వ చింతనా, కళాసాహిత్యాలూ, సంస్కృతీ విశిష్టమైనవనే భావనలు పెంచబడినవి. మత సంబంధిత చిహ్నాలనూ, సాంప్రదాయాలనూ వుపయోగించి, ప్రజలను సమీకరించడానికి గణేష్ వుత్సవాలు జరుపబడినవి. 'గీతా రహస్యం' రచింపబడింది. గాంధీజీ 'రామరాజ్య' సిద్ధాంతాన్ని ప్రజల ముందుంచినాడు. భారత జాతీయోద్యమ ప్రధాననాయకశ్రేణులు హైందవ మత భావనలు కలిగి వుండడం వల్లనూ, 'రామరాజ్య నిర్మాణం' పిలుపుతోనూ, జాతీయోద్యమ స్రవంతిలో ముస్లింలు, పూర్తిగా మమేకం కాలేక పోయారు. హిందూ మహాసభ హిందూ రాజ్య స్థాపననూ, ముస్లింలీగ్ ఇస్లాం రాజ్య స్థాపననూ లక్ష్యంగా పెట్టుకొని రాజకీయాలు నడిపినారు. అప్పటికి పూర్తి మతతత్వం వాటికి లేకున్నా, మతపరంగా ప్రజల హక్కులను గురించి మాట్లాడరు, మతపరంగా వారిని సమీకరించడం జరి

గింది. ఖిలాఫత్ ఉద్యమం, మతపరంగా ఎన్నికల నియోజకవర్గాలు జాతీయోద్యమ కాలంలో హిందూ ముస్లిం ప్రజలమధ్య విభేదాలు నాటడములో బ్రిటిష్ సామ్రాజ్య వాదులు కృతకృత్యులైనారు.

అధికార మార్పిడి తర్వాత రాజ్యాంగ ప్రవేశికలో ప్రజాస్వామ్యం, సామ్య వాదం, లౌకికవాదం చేర్చుకోబడినవి. లౌకికవాదం అంటే రాజ్యానికి మతంతో సంబంధం వుండరాదు. మతం వ్యక్తిగత విశ్వాసంగా వుంటుంది. ఈ అర్థాన్ని పాశ్చాత్య భావజాలంగా భావించారు. కాంగ్రెసుపార్టీ సెక్యులరిజం అంటే 'సమధర్మ భావన' అని, రాజ్యం అన్ని మతాలకూ సమాన గౌరవం, స్వేచ్ఛను యిస్తుందని తప్పుడు అవగాహనను ఆచరణలో పెట్టింది. అన్ని మతాలూ విమర్శకు, హేతు వుకు అతీతం చేయబడినవి. అన్ని మతాల ఛాందసవాదం, మూఢత్వం వ్యాప్తిచేసు కోవడంలో, రాజ్యాంగ యంత్రం మెజారిటీ మతాన్నీ, విశ్వాసాలనూ ఎక్కువ వ్యాప్తి చేసింది. ఈ భూమిక రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్, విశ్వ హిందూ పరిషత్తు, భారతీయ జనతా పార్టీలకు తమ 'హిందూత్వ' సిద్ధాంతాన్ని ఉధృతం చేసేందుకు దోహద పడింది. జాతీయోద్యమ కాలం నాటి హిందూ జాతీయవాద పరంపరను కొనసాగించిన సంస్థలు హిందూ పునరుద్ధరణ వాదాన్ని భిన్న రూపాలలో, అంచెలంచె లుగా విస్తృతి చేశాయి. గాంధీ, నెహ్రూల నాయకత్వంలోని కాంగ్రెసు జాతీయ వాదాన్ని తిరస్కరించి, జాతీయవాదాన్ని హిందూ మత దృక్పథంతో పునఃనిర్వచిం చారు. "మేరాదేశ్ మహాన్," "ఉస్కా నామ్ హిందూస్థాన్", "అఖండ్ భారత్" నినాదాలతో జర్మనీ, జపాన్, ఇటలీల వంటి అతివాద మత జాతీయవాదమే దేశాన్ని రక్షించగలదని, అల్పసంఖ్యాకులను దేశద్రోహులుగా, పొరుగు రాజ్యాలను భారత దేశపు భాగాలుగా, వ్యూహాత్మక నినాదాలతో వ్యాప్తినొందారు.

మెజారిటీ మతస్థుల ఐక్యత కోసం చాంధసవాదాన్ని, అహంకారాన్ని రెచ్చ గొట్టారు. హిందూమత ప్రాభవం వల్లనే ఇక్కడ ప్రజాస్వామ్యం వుందనీ, ఇస్లాం మతం వల్లనే పాకిస్తాన్, బంగ్లాదేశ్‌లలో మిలటరీ ప్రభుత్వాలు తలలెత్తాయనీ సూత్రీ కరణలు చేశారు. అయోధ్యలో బాబరు మసీదు రామజన్మభూమియని, మథురలోని ఇద్‌గా మసీదు కృష్ణ జన్మస్థానమనీ, వారణాశిలోని యింకొక మసీదు విశ్వేశ్వరాలయ మనీ, తాజ్‌మహల్ హిందూ కట్టడమనీ, వీటిని విముక్తం చేయడం ద్వారా గతపరమ వైభవాన్ని రాజ్యం సాధించగలదని జుగుప్సాకరమైన కార్యక్రమాలను చేపట్టినారు. హైదరాబాద్, మురాదాబాద్, అహ్మదాబాద్ తదితర పట్టణాల పేర్లను హైందవీకరిం చాలి. మత కల్లోలాలు సృష్టించి, మతవాద పునాదిని విశాలం చేసుకొన్నారు. అన్ని కులాలకు చెందినవారూ ఏకముద్దగా హిందువులుగా గుర్తింపుకు వ్యతిరేకించిన గిరి జన, హరిజనులపై దాడులుచేసి తమ అహంకారపూరిత చర్యలతో భయభ్రాంతు

లను చేశారు. అంబేడ్కర్ జయంతులను జరిపి, నిమ్న వర్గాల ప్రజల్ని హైందవీకరణ చేయడం ప్రారంభించారు.

మతానికి చెందిన హింసాపూరిత సంకేతాలను, త్రిశూలం వగైరాలతో మిలిటెంట్ హైందవత్వాన్ని కొన్ని శ్రేణుల్లోకి వ్యాప్తి చేశారు ప్రత్యేక సాయుధ శిక్షణల నిచ్చారు. "ఆలయానికి అడ్డంగా వస్తే, అడ్డంగా నరుకుతాం" "ముస్లింలక రెండే స్థానాలు — పాకిస్తాన్ - కబరిస్తాన్" వంటి అతివాద నినాదాలతో నిరుద్యోగ యువకులనూ, మిలిటెంట్ కార్యకర్తలను సమీకరించుకున్నారు. వారి అసంతృప్తినీ, ఆగ్రహాన్నీ హిందూ జాతీయవాదులు వాడుకొని, తమ సంస్థల నిర్మాణంలోకి యిముడ్చుకున్నారు.

అయితే మతవాదులు అనుకున్నంతమాత్రాన మతతత్వం పెరగగలదా? దానికి సమాజంలో పునాదులుండాలి. సమాజంలోని భావాలూ, ఆలోచనలూ సామాజిక శక్తిగా మారాలంటే అవి కొన్ని వర్గాల ప్రయోజనాలు కాపాడాలి. చాలాకాలంగా వ్యాప్తిలో గల మతవాదం, నేడు అతి తీవ్రతర శక్తిగా మారిదంటే, దాని ప్రయోజనాలు పొందగలిగిన వర్గాలూ, దాని సామాజిక పునాదికి దోహదపడే వర్గాలూ వుండాలి.

ఆర్థికరంగంలో వికాసం మందగించిన సమయంలో మధ్య తరగతి వర్గం ఆధునికంగా భావిస్తూనే, తన సాంస్కృతిక వునికి కోసం, మతవాద ఉద్యమ ప్రభావానికి లొంగిపోతారు. పెటీ బూర్జువా లక్షణం అది. వారికి గల మత విశ్వాసాల మూలంగా మతవాద జాతీయోద్యమంలోకి మధ్యతరగతి బాగా ఆకర్షితులైనారు. ఈ రోజున కమ్యూనిజం మధ్య తరగతితోపాటు పట్టణాలలో వర్తక వాణిజ్య వర్గాలకూ పెటీ వ్యాపార వర్గాలలోకి వ్యాపించింది. అగ్ర వర్ణాలవారూ, వెనుకబడిన వర్గాల లోనివారూ హరిజనులకు రిజర్వేషన్లను ఇవ్వడంద్వారా తాము నష్టపోయామని భావించారు.

హరిత విప్లవం ద్వారా లాభపడిన వ్యవసాయ కులాలకు చెందిన ధనిక రైతాంగం, నూతన వృత్తులను చేపట్టిన వెనుకబడిన కులాలవారు, హిందూ పునరుద్ధరణ వాద ప్రాభల్యానికి గురైనారు. హిందూ జాతీయవాద భావజాలం వారిని ఆకర్షించే నినాదాలనూ, కార్యక్రమాలనూ, మతవాదులు చేపట్టినారు. తమ కులాలను మరిచి 'హిందువులు'గా గుర్తింపు పొందాలనే శూద్రకులాలలోని భావన మానసికంగా వారు 'జై శ్రీరాం' ఉద్యమానికి చేరువయ్యారు. సోషలిజం, గరీబీ హఠావో, 21వ శతాబ్దం, దేశ సమగ్రత, పనిచేసే ప్రభుత్వం వంటి నినాదాలు ఎన్నికల ఓట్లను కురిపించని పరిస్థితులు ఏర్పడినవి. కాంగ్రెసుకు మతం ఎన్నికలలో ఓట్లు పొందే ఎత్తుగడ కాగా, భారతీయ జనతా పార్టీకి మతవాదం హిందూ రాష్ట్రాన్ని నిర్మించే వ్యూహాత్మక లక్ష్యం గలది.

అనేక జాతుల, ఉప జాతుల సమ్మేళనంగా ఏర్పడిన భారత రాజ్యంలో
భిన్న సంస్కృతుల, మతాలవారు కలసి జీవిస్తున్నారు. ప్రజల సమస్యలను పరిష్క-
రించలేని ప్రభుత్వం, ప్రజా ఉద్యమాల చైతన్యానికి అడ్డంకుగా మత భావజాలాన్ని
వాడుకొంటుంది. అస్సాం, కాశ్మీర్, పంజాబు, జార్ఖండ్‌లలో చెలరేగుతున్న
జాతుల స్వయం ప్రతిపత్తి, తదితర ఉద్యమాలను భారత పాలక వర్గాలు పారా మిలి
టరీ బలగాలచే అణచి వేస్తున్నారు. తాము అవలంభిస్తున్న నూతన ఆర్థిక విధానాలు
కారణంగానేమి, గతంలో అనుసరించిన మిశ్రమ ఆర్థిక విధానాల మూలంగానేమి
సర్వ వ్యాపిత ఆర్థిక సంక్షోభం ఏర్పడింది. నూతన ఆర్థిక విధానం, నూతన పారి
శ్రామిక విధానం, నూతన విద్యా విధానం-అన్నీ ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ
ద్రవ్య నిధి కనుసన్నల్లో రూపొందించబడినవే. విదేశీ పెట్టుబడులకు దేశం తాకట్టు
పెట్టబడుతుంది. ఈ సంక్షోభం నుండి బయటపడేందుకు చెలరేగుతున్న ప్రజాస్వా
మిక, జాతుల, స్వయం ప్రతిపత్తి ఉద్యమాలను అణచివేసేందుకు రాజ్యం మత
ఛాందస బావజాలాన్ని ప్రత్యామ్నాయంగా వాడుకుంటుంది. దేశంలో మధ్య, క్రింది
మధ్య తరగతి ప్రజలనూ, సిక్కులనూ, కాశ్మీరీలనూ, ముస్లింలనూ, ఈశాన్యరాష్ట్రాల
వారినీ శత్రువులుగా చూపించి గత ఎన్నికలలో ఉత్తర, మధ్య భారత రాష్ట్రాలలో
ఓటు బ్యాంకు పదిల పరుచుకున్నారు.

రిజర్వేషన్ల పరిధిలోకి వచ్చే యితర వెనుకబడిన వర్గాలవారు బ్రాహ్మణాధి
క్యత గల హిందూమత వాదుల ప్రభావానికి గురి కావడం విచారమే. ఆ కలయిక
మిక్కిలి సంక్లిష్టమైనది. అయితే కొన్ని నిర్దిష్ట చారిత్రక పరిస్థితుల సంక్షోభం ఫలి
తంగా ఆ వర్గాలు మతవాద ఉద్యమంలో భాగమైనవి. భూమి కోసం, భుక్తి కోసం
జరిగే రైతాంగ ఉద్యమాలున్న చోట హిందూ మత వాదుల ఎత్తుగడలు పారలేదు.

రాజకీయ, ఆర్థిక, సామాజిక వ్యవస్థ పూర్తిగా సంక్షోభంలో పడిపోయింది.
పాలకులు మెజారిటీ పేద, మధ్య తరగతి ప్రజల సమస్యలను పరిష్కరించలేరు.
సామ్రాజ్యవాదులకు ఊడిగం చేసే తాబేదారులు. భూస్వాముల, పెట్టుబడిదారుల
ప్రయోజనాలు కాపాడబడేందుకు రాజ్యం నిరంకుశంగా, నియంతృత్వంగా తనస్వభా
వాన్ని చాలాకాలం క్రిందటే సంతరించుకొన్నది. రాజ్యాంగ యంత్రంలోని అన్ని
శ్రేణుల్లోకి మతవాద శక్తులు ప్రవేశించాయి. చాలాకాలం క్రితం వరకూ ఉదారవాదు
లుగా పేరొందిన రచయితలూ, సంపాదకులూ, మేధావులూ 'హిందూత్వ' భావన
పరిధిలోకి తేబడినాయి. పారామిలటరీ దళాలూ, కోర్టులూ, పాలక పార్టీ కూడా
'హిందూత్వ' భావన ప్రభావానికి గురి కాబడినారు. కాబట్టి పి. వి. నరసింహారావు,
కళ్యాణ్ సింగ్‌ను విశ్వసిస్తారు. కళ్యాణ్ సింగ్ మాటను సుప్రీంకోర్టు విశ్వసిస్తుంది.
అయోధ్యలో పోలీసులు, పారా మిలటరీలు, కరసేవకులను భక్తి వినమ్రతలతో ప్రణ
మిల్లుతారు. ఈ విధంగా బయట నుండి ఉద్యమంగా పెరుగుతున్న మతవాద శక్తు

లకు, రాజ్యాంగ యంత్రంలోని అండదండలతో తన విశ్వరూపాన్ని అయోధ్యలో ప్రదర్శించింది.

'మెజారిజం'తో హిందూ ఛాందస శక్తులు ఉన్నత న్యాయస్థానాన్నీ, కేంద్ర కార్య నిర్వాహక వర్గాన్నీ, పారామిలటరీ బలగాలనూ ఎదిరించి, తమ అధిక్య అహంకారవాద బలాన్ని చూపించారు. బాబరీ మసీదు భౌతికంగా కూలని కట్టడం కూలిపోయింది. అల్పసంఖ్యాక వర్గాల ప్రజల విశ్వాసం, రాజ్యాంగ సూత్రమైన 'లౌకిక వాదం' కూల్చబడినాయి. యిక రానున్నదీ అది-బిజెపి కాని, కాంగ్రెసుకాని దాని కార్యాచరణలో, ఏలుబడిలో, ఆలోచనలో 'హైందవ' బలంగా తన శక్తిని ప్రదర్శిస్తూనే వుంటుంది. వాళ్ళు మనం అని మెజారిటీ ప్రజలు, మైనారిటీలు, విడి పోయిన సరళితో సామాజిక వ్యవస్థ పని చేస్తుంది.

## మరేం చేయాలి ? అన్నది ప్రధానం :

మతతత్వం కేవలం బి.జె.పి, దాని అనుబంధ సంస్థలదేనన్నది తప్పుడు భావన. కాంగ్రెసు, మిగతా పాలక పార్టీలు సెక్యులర్ అని భావించడం మరీ తప్పు. వాళ్ళతో కలసి సెక్యులర్ ఫ్రంట్ ద్వారా మతవాదాన్ని ఎదుర్కొనేందుకు 'నిషేధం' అనే ఆయుధాన్ని రాజ్యం వాడుకునేందుకు అనుమతిస్తే, తద్వారా ప్రజాఉద్యమాలకు, ప్రజాస్వామిక హక్కులకు చాలా ప్రమాదం. మతతత్వాన్ని, మత భావనలద్వారానే ఎదుర్కొనే చర్యలవల్ల అంతిమంగా మతవాదం మాత్రమే బలపడుతుంది. సెక్యుల రిజం పీడిత ప్రజల దృక్పథంతో నిర్వచింపబడాలి. మతోన్మాదమూ, హిందూమత వాదం ఈ సమాజంలోని, రాజ్యాంగ యంత్రంలోంచి విడదీసి చూడలేని అవిభాజ్య అంశాలు. మతోన్మాదాన్ని పెంచి పోషించేందుకు సామాజిక వ్యవస్థే ప్రధానకారణం. అర్ధవలస-అర్ధ భూస్వామిక దళారీ వ్యవస్థను నేలమట్టం చేయకుండా, ఫాసిస్టు భావ జాలాన్ని నిర్మూలించలేం. ప్రజలను విభజిస్తున్న, అణచివేస్తున్న పాలకుల తప్పుడు విధానాలకు వ్యతిరేకంగా ప్రజలను సమీకరించాలి. భారత ప్రజలపై బలవంతంగా రుద్దబడుతున్న ఫాసిస్టు సామాజిక వాదమే మతతత్వవాదం. అర్ధవలస-అర్ధ భూస్వా మిక వ్యస్థను కాపాడుతూ, పీడిత ప్రజలను దోపిడి చేస్తూ, వారి పోరాటాలను కర్కశంగా అణచివేయడమే ఫాసిస్టు వ్యవస్థ లక్ష్యం. మానవ విలువలకే శత్రువు. స్వేచ్ఛకూ, సమానత్వానికీ, సౌభ్రాతృత్వానికీ, సమ సమాజానికి మతతత్వ వర్గం ప్రధాన శత్రువు. రాజకీయ, సాంస్కృతిక, కళా, సాహిత్య, సామాజిక, ఆర్థిక రంగాల్లో పీడిత ప్రజల పోరాటాలే, వారి ఉద్యమాచరణే మతవాదానికిపరిష్కారం కాగలవు. జాతీయవాదం, సమగ్రత, సమధర్మ భావన, నేటి మతవాదభావజాలానికి ప్రత్యామ్నాయం కాదు. విస్తృత ప్రజాతంత్ర పోరాటమే దానిని ఎదిరించి సాహస ముగా నిలబడగలదు. పోరాడితే పోయేవి సంకెళ్ళు మాత్రమే. ఫాసిస్టు మూకల

బీభత్స కాండను గురించి జర్మనీలో ఆనాడు ఒక మేధావి, రచయిత పాస్టర్ నీయ మోల్లీర్ మాటల్ని జ్ఞప్తి చేసుకుందాం :

వాళ్ళు మొదట యూదుల కోసం వచ్చారు
నేను మౌనంగా వున్నాను, నేను యూదును కాను.
వాళ్ళు కమ్యూనిష్టుల కోసం వచ్చారు
నేను మౌనంగా వున్నాను; నేను కమ్యూనిష్టుని కాను.
వాళ్ళు కాథలిక్కుల కోసం వచ్చారు
నేను మళ్ళీ మౌనంగా వున్నాను ;
నేను కాథలిక్కును కానుగా
వాళ్ళు మళ్ళీ వచ్చారు
వాళ్ళు ఈసారి నా కోసమే వచ్చారు
నా పక్షాన నోరు విప్పేందుకు
ఇపుడెవరూ లేరు.

---

గల్పిక :

## నూతన ఆర్థిక విధానం

— శ్రీకృష్ణ

"గురువర్యా! నూతన ఆర్థిక విధానం అనగానేమి?"

"నా శిష్యుడవై ఉండి ఎంత వెనుకబడి ఉన్నావు, నాయనా!"

"నేనా?"

"కాకపోతే మరెవరు ? రత్నగర్భ యందు జన్మించి, అన్నపూర్ణ ఒడిలో పెరిగి, వేద భూమిలో విద్య నేర్చిన నీకు ఆమాత్రం అర్థం తెలీకపోతే ఏమనాలి?"

"క్షమించండి గురువర్యా! ఇంతవరకు ఆర్థిక విధానం గురించి వింటినిగాని, ఈ నూతన ఆర్థిక విధానం గురించి తెలియదు! కనుకనే అడిగితిని."

"అటులనా! మరి అర్థిక విధానం అనగానేమి ?"

"అడుక్కుతినే విధానం"

"కదా! అటులనే నూతన అర్థిక విధానమనగా నూతన అడుక్కుతినే విధానం, శిష్యా!"

"ఇప్పుడిప్పుడే అర్థమౌతున్నది, గురువర్యా! మీదగ్గర నేర్చుకోవలసిన జ్ఞానం చాలా ఉన్నది, గురువర్యా!" ★

బూటకపు ఎన్‌కౌంటర్‌లో హతుడైన పాత్రికేయుడు గులాం రసూల్ ప్రథమ వర్ధంతి సందర్భంగా (డిసెంబరు 29):



# మరణం లేని అక్షరం

★★★

అక్షరానికి అన్నీ తెలుసు
పొద్దున్నే యింటింటికీ విసరబడుతున్న చరిత్ర తెలుసు
చరిత్ర రాల్చే నీడల్లో
నరమాంసం ఉడక బెడుతున్న కిరాతకాలు తెలుసు
దొంగల్ని వేటాడే గుండెల కళ్ళల్లో
కన్నీటి కార్చిచ్చుల పాటలు తెలుసు
పాటలుగా మారిన నిజాలు
చీకటి రెప్పలు విప్పడం తెలుసు -
అక్షరానికి అన్నీ తెలుసు
పేదవాళ్ళ గుడిసెల్ని పీకేసినప్పుడు
శూన్య స్థలంలో ప్రజాస్వామ్య శవం పడి ఉందని తెలుసు
ఆ శవాన్ని పీక్కుతింటూ
రాకాసులందరూ బృందనాట్యం చేశారని తెలుసు
ఆ నాట్యాన్ని చూస్తూ
చట్టాలన్నీ చప్పట్లుకొట్టి ఒళ్ళు మరిచినయ్యని తెలుసు
ఒళ్ళు మరిచిన చట్టాలు
ప్రజలకి మరణశాసనాలు పంచి పెడుతున్నయ్యని తెలుసు -
అక్షరానికి అన్నీ తెలుసు -
కాగితాలకి దేశం ఋణపడి ఉండడం తెలుసు
కాగితాలు నల్ల సముద్రంలో
ఆకాశహర్మ్యాలు కట్టడం తెలుసు -

కుగ్రామం నుంచి రాజధాని దాకా
కాగితాల నీడల్లోనే రాజకీయం రంకు చేస్తోందని తెలుసు -
ప్రాణం ఉన్న ప్రజల ప్రాణాల్ని
ప్రాణం లేని కాగితమే పరిపాలిస్తోందని తెలుసు.
అక్షరానికి అన్నీ తెలుసు
కాగితంపులిని ఆవు నమిలేస్తుందని తెలుసు
గుండెలో కదిలిన నాదం
గుండెను ముక్కలు చేస్తుందని తెలుసు
పెదవుల మీద నెత్తురు పాట
పీడితుల బాట మీద వసంతం జల్లుతుందని తెలుసు
పదాలు వాక్యంలో అమరిపోయి రసాన్ని చిందినట్లు
ప్రజలు సమస్యల్లో నిలబడి రక్తం చిందిస్తారని తెలుసు
అన్నీ తెలుసిన అక్షరం మీద / అజ్ఞానం పగ బడుతుంది
'ఉదయం' లాంటి అక్షరం మీద
అజ్ఞానం అస్తమయాన్ని చిమ్ముతుంది
బంధించిన అక్షరం మీద / అజ్ఞానం ఎన్‌కౌంటర్ చేస్తుంది -
అక్షరానికి తను చేసిన నేరం తెలియదు
ప్రజల్ని మేలుకొలపడం
ప్రజా శత్రువు సహించడని తెలియదు
అన్నీ తెలియడమే తన మరణానికి
'రాజ' మార్గమని అసలే తెలియదు
మనిషిలోంచి మనిషిలోకి స్రవించేది అక్షరం
తరంలోంచి తరంలోకి ద్రవించేది అక్షరం
మనిషిని బతికించే భావానికి ఊపిరి పునాది అక్షరం
మనిషిని కదిలించే గీతానికి తొలి గీత గీసేది అక్షరం
క్షరమైపోయిన ప్రపంచానికి ఆశగా నిలిచేది అక్షరం
కను మరుగైన అక్షరం
కళ్ళ వెనక నిలిచి దోవ చూపుతుంది
ఎగిరిపోయిన అక్షరం
నింగిలోంచి వెలుగుపాట పెదజల్లుతుంది
చరిత్రగా మిగిలిన అక్షరం / చరిత్రను సృష్టిస్తుంది.

—అద్దేపల్లి రామ్మోహనరావు

('గోదావరి నా ప్రతిబింబం' నుంచి)

# కష్ట జీవులం

— రాజ్ శ్రీనివాస్

"నమస్కారం సార్! సారా రాజుగారూ! మీ గురించి రెండు ముక్కలు చెబుదురూ?"

"చూడండి బాబూ! బోల్డంత డబ్బు కిస్తీ కట్టాలి. ఇంతా జేస్తే లమ్డీకొడుకులు 'నాటు' తాగేస్తారు. మేం మాత్రం ఏం సుఖపడిపోతున్నాం. ప్రతి గాడిద కొడుక్కి ఎలక్షనొస్తే లక్షలక్షలివ్వాలి. ఏటికేడాదీ అమ్మితే మాకేం లాభం, ఉద్యమంఅంట. ఉద్యమం. మమ్మల్ని ఎంతమంది ఎన్నిరకాలుగా బాధలు పెడుతున్నారో ఆ భగవంతుడికి తెల్సు. మీరు చెప్పండి. మేం తాగ మన్నామా? ఇదిగో మేష్టారూ! మాట వరసకి మిమ్మల్ని తాగమన్నాననుకోండి. మీరేం చేస్తారండీ మొహం మీద ఉమ్మేస్తారు. మేం తాగమంటే తాగుతారా! మానేమంటే మానేస్తారా? మేవేమీ దొంగతనం చెయ్యడంలేదే, పబ్లిగ్గా గవర్నమెంటు పర్మిషనుతో అమ్ముతున్నాం .... ఎన్నాయినా చెప్పండి మేష్టారూ! మాకు సుఖం లేదండీ. అయినా ఆడోళ్ళ కంత విరగబాటెందుకండీ ? తప్పు. చాలా పొరపాటు .... అలాగ షాపులు మీద పడి అరాచకం చెయ్యడం గొప్పతప్పు. దౌర్జన్యం నశించాలి....."

"అయితే మీ కేవీ సుఖం లేదంటారు"?

"అస్సే అసలు లేదు. అంతాలేదు. ఎక్సైజోళ్ళకీ, మినిష్టర్లకీ, పోలీసోళ్ళకీ ఆళ్ళ పనే బావుంది."

"అంతే నంటారా?"

"అంతే."

o o o

"బాబూ ఎక్సైజీ ! సారా దొరేంటి అలా అంటున్నాడు? నీ సంగతేమిటీ ?'

"అంతా అబద్ధం. నమ్మొద్దు. వాడు వందల కోట్లు దొబ్బి, మా మొహాని ప్రెసాదం లా ఇంత పారెస్తున్నాడు. అయినా మేవేం అడ్డీగలం. గవర్నమెంటే ఆడిది. కుయ్. కుయ్. మన్నావంటే నల్లిని నలిపినట్టు నలిపిపారేస్తారు మా కన్నా ఎవ్వడి బతుకయినా మెరుగే. ఎక్సైజోడంటే ప్రెజల్లో ఇలువే లేదు. అస్సలు సుఖం లేదు."

"అస్సలు సుఖం లేదా?"
"లేదు."

o o o

"బాబూ పోలీసూ! ఎక్సైజు మావయ్యా! సారా బాబాయీ అలా అంటున్నారు. మరి నీ సంగతేంటీ"....?

"చూడు బ్రెదరూ ! లచ్చ రూపాయి లిస్తేమాత్తరం నువ్వీ శవం దగ్గిర కాపలా ఉంటావా? ఉండవు. కానీ నానుంతాల. ఉంతాలంటే సిన్నది కడుపులో కెళ్ళాలి. ఎల్లాలంటే డబ్బులుండాల. డబ్బులుండాలంటే ఒకోసారి కళ్ళిప్పాల. ఒకోసారి కళ్ళు మూయ్యాల. అయినా మేమెంత. మా బతుకెంత. ఆపీసర్నా కొడుకులొచ్చేరంటే ఆళ్ళకి మందిప్పించాల. ముండని తేవాల ---- గురూ! మరి సెప్పలేను. మాకు అసలు సుకం లేదు. మాకు సారా బ్రెదర్సు డబ్బులు కట్టీమాట నిజవే. కానందులో సంగోరు మళ్ళీ ఆళ్ళకే పోతంది .... అయినా మరాళ్ళకే సుకం లేన ప్పుడు నాకెలాగొస్తాది సుకం. నువ్వు జెప్పు గురూ ---- సుకం లేదు. సుకం లేనే లేదు.

o o o

'నమస్కారం సార్'! మినిష్టర్గారూ! తవరి గోరి పేరు మారుమ్రోగి పోతుందండి. ఎవుర్నడిగినా తవర్నే సెప్తన్నారు. సుకాలన్నీ తవరికీని, కష్టాలన్నీ అందరికీని. అంటే ఆల్ డిపార్ట్మెంట్సు కని అంటున్నారండి."

"నమస్కారం బాబూ. అంత మాటనేసేరా నాయినా. ఒరే బాబూ, నీ చేతులు పట్టుకుంటాను. వాళ్ళు చెప్పుకుంటున్నారు. మేం చెప్పుకోలేక పోతున్నాం. అంతే తేడా. నువ్వయినా నమ్ము. మా కసలు సుఖం అనేది ఏ కోశానా లేదు. మా అల్లుళ్ళు స్విట్జర్లెండులో వున్నారు. అక్కడ వాళ్ళకి డబ్బులు చాల్డం లేదట. నానా అవస్థా పడుతున్నారు. నా కొడుకులు కష్టపడి చదివి అమెరికాలో డాక్టర్లయి పోయేరు. వాళ్ళు నాకొడుకులవడం తప్పా. వాళ్ళు ఫ్యాక్టరీలు పెట్టుకోవడానికి లైసెన్సులకి పెడితే పత్రికలోళ్ళు అన్యాయంగా అల్లరిజేస్సేరు. ఇదేవన్నా న్యాయంగా ఉందా ....? నా బావమరిది అడి మట్టుకాడు సొంతంగా గ్రానైటు గనులు లీజుకి తీసుకుంటే అదీ నా మీదికే తోస్సేరు ---- మా మంత్రులందరూ ఎన్ని బాధలు పడుతున్నావో నీకేం తెల్సు నాయనా. మా కసలు సుకం లేదు. సుకం లేదు బాబూ."

"అది కాదండీ 'సారాజు' లందరూ బోల్డంత డబ్బు మీకే ఇస్తున్నారనీ' ... నీ "బాబూ, మీకు తెలీదు. మీరు నమ్మరు. వాళ్ళు డబ్బు లివ్వడం నిజవే. కానీ అదంతా ఎలక్షన్లకి ఖర్చయి పోతోంది బాబూ. అంటే మళ్ళీ ఆల్లకే పోతంది. అంటే మళ్ళీ ఆల్లకీ ఉండడం లేదనుకో .... ప్రెజలకి బస్తాలకి బస్తాలు పోయిస్తే గానీ నిగాయితీగా నాలాంటి మంచివాళ్ళకి ఓట్లెయ్యరు గదా ....అంచేత బాబూ ....→

## కటాక్షం!

మానవ హక్కుల పరిరక్షణకు
ఇప్పుడిక "తోడేలే" నడుం బిగించింది,
తానే సర్వస్వమై
ఏం చక్కా తీర్పు చెప్పుకోవచ్చు,
ఆకలేసినప్పుడల్లా / తీరిగ్గా ఏమూలైనా
ఏ గొర్రెనైనా ఏరుకోవచ్చు,
ప్రజాస్వామ్య భజనలో / హాయిగా త్రేన్చేసి
సాక్ష్యంగా మిగిలే ఎముకలపై
తాత్వికంగానే విచారణ సాగించవచ్చు
తలలూపే గొర్రెల నడుమ
అతి పెద్ద ప్రజాతంత్ర దేశంగా
విదేశీ వేటగాళ్ళకు తోడై
మానవ హక్కుల ఉద్ఘోషలో
ఇప్పుడెవరికైనా ఎప్పుడైనా
వీలైనన్ని "భారత రత్నాలు" ప్రకటించుకోవచ్చు !!

— నిఖిలేశ్వర్

("మానవ హక్కుల కమీషన్ ఏర్పాటుకు ముఖ్యమంత్రుల సదస్సు నిర్ణయం" 14-9-92 నాటి పత్రికల పతాక శీర్షికలు చదివిన తర్వాత )

---

→ఈ వేళ ఇదంతా కూడా .... ఈ సుఖం అంతా కూడా ప్రెజలకేగానీ, మరెవరికీ లేదని నువ్వు నమ్మినా నమ్మకపోయినా మనవి చేస్తున్నాను."

"అంతే నంటారా ?

"అంతే బాబూ! కూలోడి పని సుఖం బాబూ. ఆడికే టెన్షనూ లేదు. ఏ రోజు కూలి ఆరోజు తెచ్చుకుంటాడు. హాయిగా ఓ బస్తా ఏసుకుంటాడు. రేపు గురించి బెంగ కాదు. ఈ కష్టాలన్నీ మన దొంటోళ్ళకే బాబూ ...."

"అయితే సుఖాలన్నీ ప్రెజలకే అంటారు."

"అంతే బాబూ అంతే. మేం ఎల్ల వేళలా మా సమయం అంతా ప్రెజల సుఖం కోసమే ఖర్చు సెడుతున్నాం. ఈ సారాలూ, ఈ మందులూ, ఈ యొక్క ఎగుమతులూ, ఆ యొక్క దిగుమతులూ, అమ్మకాలూ కొనుగోళ్ళు .... అన్నీ అంతా ప్రెజలకే."

"అంతే నంటారా." / "అంతే. / అంతే."

"అయ్యా! అదీ విషయం. పాపం వాళ్ళెవరికీ సుకం లేదు. ఇదంతా వాళ్ళే చెప్తున్నారు. నేను చెప్పినియి గాదు. నమ్మితే నమ్మండి. లేకపోతే లేదు."

# మతోన్మాదుల తరిమి కొడదాం

మతం మత్తు మందు లాంటిదో రన్నయా
తరిమికొట్ట పరుగు తీయరో ........
కోట్లాది పేదోళ్ళు కూడులేక చస్తుంటె
పల్లెల్లో పేదోళ్ళు నీళ్ళు లేక నోళ్ళెండే
ఆంధ్రదేశ మంతా ఆకలి చావులతో నిండే
వానలొచ్చి వరదలొచ్చి గూడు లేక పండుంటె
కష్టాలు తీర్చనోడు కరసేవకు రమ్మండు........ ॥మతం॥

ఆకలి కరువు ప్రజల పట్టి పీడిస్తుంటె
ఆలయ నిర్మాణ మంటూ ఆగడాలు చేస్తుండ్రు
బాబ్రీ మసీదు కూల్చి బాదలు పోగొడ్తరంట
ప్రజల బాదపట్టనోడు రామపూజకు రమ్మండు........ ॥మతం।

కులం పేర మతంపేర మారణహోమం లేపి
పేద ప్రజల ఐక్యతను చాల్చనాకి కుట్రపన్ని
శాంతి జపం వల్లిస్తూ రక్తాలనే పారిస్తూ
మతం పేర మన మద్య-చిచ్చుపెట్ట జూస్తుండ్రు........ ॥మతం॥

బువ్వలేక నిరుపేదలు బిచ్చగాళ్ళు అవుతుంటె
జ్ఞానం, శీలం, ఏకతంటు గునపాలు గ్రుచ్చుతుండ్రు
అధిక ధరలు, అప్పులతో బతుకు భారమవుతుంటె
బతుకుదెరువు చూపనోడు-భజన కీర్తనంటుండు........ ॥మతం॥

రామమందిరం పేర అందల మెక్కాలని
పడరాని పాట్లు పడి ఓట్లు గుంజజూస్తుండ్రు
వాళ్ళ ఎత్తులన్ని చిత్తుచేస్తు మత్తువదల తీయాలి- ........ మతం

ఏ కులము, ఏ మతము కూడుగుడ్డ నివ్వలేదు
రామగుడి కట్టిస్తే రాతేమి మారదన్న
తెలంగాణ జిల్లాలో భూమి, భుక్తి, విముక్తి కొరకు
సాగుతున్న పోరులోన - ప్రజలంతా ఒక్కటయ్యి
ప్రతిఘటనా పోరులోన - మతోన్మాదుల తరిమి కొట్టాం........ ॥మతం॥

—ఎ. సంతోష్

# పిల్లల ప్రపంచం





## 'వాయిస్ ఆఫ్ చిన్ని'

## దేవుడున్నాడా ?

అవును. "పిల్లల ప్రపంచం" నిల దీసి అడుగుతోంది. జవాబు చెప్పండి. నిజానికి మా పిల్లలందరికీ వచ్చే రక రకాల ప్రశ్నల్లో ఇది ప్రధానమైనది. ఎందుకంటే ఆకాశంలో నిఇంద్రధనుస్సూ బారులు తీరిన పిట్టల గుంపూ, రంగు రంగుల పూలూ, గాలి వినిపించే పాటా మా పిల్లల్ని ఆశ్చర్యపరిచినపుడు ఇవన్నీ ఎక్కడ నుండి వచ్చాయి ? ఎలా వచ్చాయి ? ఇలాంటి అనేక ప్రశ్నలు వస్తాయి. చాలా మంది ఈ ప్రపంచ మంతా దేవుడు చేసిందే అంటారు. అంతేగాదు మా పిల్లలే దేవుళ్ళని కథలు రాస్తారు. కవిత్వాలు చెబుతారు.

మేం నిజమే కాబోలనుకుంటాం. అంతలోనే దేవుడుంటే కనిపించడే అను కుంటాం. పెద్దయితే కనిపిస్తాడు అని చెబుతారు. ఇదంతా మేం నమ్ముతుం టాం.

మీ పెద్దవాళ్ళు అరిచినప్పుడూ మా మీద పడి బాదుతున్నప్పుడూ ఇంకా చాలాసార్లు దేవుడెందుకున్నాడనిపిస్తుంది. మేమందరమూ గుళ్ళల్లోకి పరుగులు తీసుకువెళ్తున్నామంటే కారణం అక్కడ ప్రసాదం దొరుకుతుంది. అక్కడఎర్రటి బొట్టు ఉంటుంది. మా తలమీద రాజుగారి కిరీటం పెడతారు.

ఇంత జరుగుతుంటే మాకో అంకుల్ కనిపించి 'దేవుడూ గీవుడూ లేడ్రా మనిషే వున్నాడు' అని చెప్పాడు. దేవుడు ఎందుకు లేడు? అన్నాం. "మనిషి ఉండగా ఇంకదేవుడెందుకు ?" అన్నాడు "మరి చెట్లూ, పిట్టలూ అన్నీనో" అన్నాం అన్నీ ఉంటాయి. 'దేవుడు మాత్రం ఉండడు' అని ఏదో చెబుతుంటే ఓపెద్దా యన వచ్చి కోపంగా ఏమన్నాడంటే—

"ఒరేయ్ పిల్లల్ని చెడగొట్టకురా. వాళ్ళకి ఇప్పటి నుంచే ఈ కబుర్లు చెప్పి ఏం చేయాలనుకుంటున్నావ్" అన్నాడు

"మరేం కబుర్లు చెప్ప మంటావ్ చిన్నప్పటి నుండే అయ్యప్ప పూజలు. చేయించమంటావా" అంటూ ఏదో అన్నాడు.



నిర్వహణ :పి. చంద్రశేఖర్ ఆజాద్ APSTC Ltd., డి. సి. ఎమ్. ఎస్, బిల్డింగ్స్, ఎస్. ఆర్. పేట, ఏలూరు.

వాళ్ళు బాగా పోట్లాడుకున్నారు?

మాకు అప్పుడు కొత్త అనుమానం వచ్చింది.

అయ్యప్ప ఎవరు? ఆంజనేయుడెవరు? రాముడెవరు? క్రీస్తు ఎవరు? అల్లా ఎవరు?

అంతా దేవుళ్ళేనా?

మరి మా ఊరు వచ్చిన స్వామిగారు నేనూ దేవుడ్నే అంటున్నాడుగా! ఆయ నెవరు?

మాకు తలకాయ తిరిగిపోతోంది. ఒక దేవుడు గురించి తెలుసుకుంటే ఇంకో దేవుడొస్తున్నాడు.

ఇదంతా ఇలా ఉంటే 'బుల్లి'గాడు గెత్తుకొచ్చి "మళ్ళీ ఒళ్ళు లేవొచ్చే" అన్నాడు. ఎందుకురా అంటే "బ్రద్దల్.. బాంబుల్.... పలుగుల్తో పొడిచేశారంతే" అన్నాడు.

"ఎవర్నిరా?" అన్నా.

"మసీదుల్ని" అన్నాడు.

అంతే. మేమందరం పరిగెత్తుకుంటూ వెళ్తే.... కేకలు....గోల.... ఎవరెవరో పరిగెత్తుతున్నారు. వారి చేతుల్లో కత్తులున్నాయి. కర్రలున్నాయి. మా కళ్ళ ముందే రాళ్ళు....మంటలు....రక్తాలు... పోలీసులు....బయటకు వస్తే కాలుస్తుంటారంట.... ఎన్ని రోజులిలా..పాలులేవు.. కూరలు లేవు....నీళ్ళు రావు....భయం.. భయం....

'దేవుడు లేడు' అన్నాడు బుల్లిగాడు

"ఎందుకనిరా" అన్నాం మేం.

"ఏమో" అన్నాడు.

మేం మెల్లగా వెళ్ళి మా అంకుల్ మీద పోట్లాడిన పెద్దాయనని అడిగాం...

దేవుడున్నాడా? ఎక్కడున్నాడు? పలుగుల్తో తవ్వుతున్నప్పుడు ఏమయ్యాడు? పాలు లేక పిల్లలు ఏడుస్తుంటే ఏం చేశాడు? పెద్దవాళ్ళంతా మాకు అబద్ధాలు చెబుతున్నారు. మా పాఠాలు అలా రాశారు. ఇక్కడ అన్ని మతాలు సమానం కాదు. అందరూ దొంగలే. దేవుడుంటే పసిపిల్లవాడ్ని తగలబెడుతుంటే చూస్తూ ఊరుకుంటాడా? అది సరే. దేవుడెప్పుడూ నవ్వుతూ కనిపిస్తాడే.... ఇవన్నీ చూసి గుండె పగిలేలా ఏడవడే. ఒక్కసారయినా కనిపించడే?

సమాధానం లేదు.

మేమందరం "అంకుల్" దగ్గరకు పరిగెత్తుకెళ్ళాం ....

ఆయన ఏడుస్తున్నాడు. మాఅందరినీ దగ్గరకు లాక్కున్నాడు. "లేదు రా.... దేవుడు లేనే లేడు. మనిషే ఉన్నాడు.... ఉండాలి" అన్నాడు

"అవును" అన్నాం మేం.

"మేమడుగుతున్నాం"దేవుడున్నాడా?

కొత్త జవాబు చెప్పండి.

మాపాఠాలన్నీమా ర్చితిరగరాయండి.

మనిషికోసం పాడండి. మనిషికోసం బతకండి 'దేవుడంటూ' చంపే వాళ్ళూ చచ్చే వాళ్ళూ మా ప్రపంచానికి అవసరం లేదు.

మనుషులందరిదీ ఈ ప్రపంచం

అదే మా పిల్లల కిష్టం.

# చెప్పాల్సింది చాలానే వుంది

ఇంతకన్నా వేరే చెప్పాల్సిందేం లేదు -
మెట్టు మెట్టుగా జీవితం చిదిమెయ్యబడిన చోట -
బొట్టు బొట్టుగా నీరుగారి మనసు పాసిపోయినచోట -
ఎక్కడంటే........సరిగ్గా అక్కడే
పన్నెండో ఏడు వసంతంగా కాక నిప్పుల వర్షంలా శరీరాన్ని తాకిన చోట
ఎప్పుడొచ్చిందో ఏమో........
చాపకింద నీరులా చెప్పకుండా చెయ్యకుండా.
బాల్యమే దుర్భరం అయిన ఈ పాడు నేల మీద
పొటమరిస్తూనే అవమానాన్ని కురిపించింది
ఈ ముదనష్టపు యవ్వనం.
ఈ గెడ్డమీద చాలా మందికి పూల తొడిమలు తెలీవు తల్లీ !
మనసంటూ ఒక దాన్ని బ్రతికి ఉండనిస్తే కదా -
అది ద్రవమో - ఘనమో విశ్లేషించు కోడానికి.
ఇక్కడ ప్రతీదీ గతితర్కమే నిర్మలా !
జీవితాన్ని జీవించే అవకాశం ఉంటే
చిట్టి పర్వతాలు కాదు -
పూలరాశులే అవి -
కేవలం స్తనాలు కాదు - జీవగుళికలు -
మేం అంత భాగ్యానికి నోచుకోలేదమ్మా !
ఎదుగుతున్న శరీరానికి
సహజంగానే కావాల్సిన కొద్ది ఎక్కువ బట్టకీ-తిండికీ....
తల్లీ-తలచు కుంటే ఏడుపాగట్లేదు —
"జెండా కొయ్య"వన్నారు
"బాలాకుమారివి కాదు కదా" అన్నారు
రెండు నెలల క్రిందటే కదా కుట్టించాం బనీన్లు !
మరి అవి చాలకపోతే నాదా తప్పు !
భద్రత లేని బతుకులు చిట్టీ ! ఇక్కడ
కర్కోటంగా - రాక్షసంగా
అవమానించబడ్డ యవ్వన ఛాయలు ఇవి.
ఒక్క హృదయమే శైశవం నుండీ శిశిరం దాకా
ఇన్నిగాట్లు పడి, ఇంతగా నెత్తురోడుతోందో

(తరువాయి 56 పేజీ)

డిశంబరు 12, బ్రౌన్ వర్ధంతి సందర్భంగా:



# చార్లెస్ ఫిలిప్ బ్రౌన్

## ( 1798 - 1884 )

— ఛాయరాజ్

"In 1825 I found Telugu literature dead
In thirty years I raised it to life"

ఈస్టిండియా కంపెనీ రూపంలో ఆంగ్లేయులు భారతదేశంలో ప్రవేశించి క్రమముగా భారత పాలనాధికారాన్ని చేజిక్కించుకొన్నారు. దేశ సంపదలను నిరాటంగా దోచుకొనేందుకు అనువైన పరిస్థితులు సృష్టించుకొనే ప్రయత్నంలో భాగంగా, వూహకందని విధంగా వారు భారత సాంఘిక, ఆర్థిక, రాజకీయ, భాషా, సాంస్కృతిక రంగాలలో పెను మార్పులకు దోహదం చేశారు. కంపెనీ ఉద్యోగులుగా భారతదేశం వచ్చి పాలనాధికారం తమ వర్గం చేతిలో వున్నా, మానవతావాదులైన కొందరు ఆంగ్లేయులు భారతజాతిని ప్రేమించి ప్రజల బహుముఖాభివృద్ధికి కృషి చేశారు. ఇలాంటి వారిని నేటికీ మన దేశ ప్రజలు తమ ప్రియమైన బాంధవులుగా గుర్తుంచుకుంటున్నారు.

తెలుగు భాషా, సాహిత్యాల అభివృద్ధికి సుమారు 34 ఏళ్ళు తమ సర్వశక్తులు వినియోగించి కృషిచేస్తూ ప్రజల మధ్య సామ్రాజ్యవాదులు ప్రతినిధిగా జీవించిన సి.పి. బ్రౌన్ చిరస్మరణీయుడు.

కంపెనీ ఉద్యోగిగా వచ్చిన డేవిడ్ బ్రౌన్ దంపతులకు కలకత్తాలో సి. పి. బ్రౌన్ జన్మించినా తండ్రి మరణానంతరం ఇంగ్లండు వెళ్ళి అక్కడే విద్యాభ్యాసం చేసి, ఉద్యోగిగా ఆగస్టులో మద్రాసు వచ్చి తెలుగు భాషాధ్యయనం ప్రారంభించారు. సివిల్ సర్వీసు నిర్వహణకు స్థానిక భాషలో వ్యావహారిక జ్ఞాన అవసరాన్ని గుర్తించి ప్రజలనే తన గురువులుగా ఏంచి తెలుగు వ్యావహారిక భాషను క్షుణ్ణంగా నేర్చుకొన్నారు. 1820లో ఉద్యోగ రీత్యా కడప వచ్చి రెండు పాఠశాలలను నెల[illegible] అం

దులో ఉచితంగా తెలుగు నేర్పించారు. అబే దుబాయ్ అనే ఫ్రెంచి మత గురువు రాసిన గ్రంథంలో వేమన కవి ప్రస్తావన చూచి, తను పని చేసే కడప జిల్లాలోనే గొప్ప తెలుగు కవి వుండేవాడని తెలుసుకొని, వేమన పద్యాలున్న తాటాకు గ్రంథాలను సేకరించారు. వేమన పద్యాలను మత, నీతి, అధిక్షేప, మర్మ, కలగూరగంప, విషయాలుగా విభజించి వాటిని ఇంగ్లీషులోనికి అనువదించి స్వంత ఖర్చులతో ప్రచురించి తెలుగు సాహిత్యానికి అంతర్జాతీయ ఖ్యాతి తెచ్చారు బ్రౌన్.

బ్రౌన్ నివసించే ఇళ్ళను "బ్రౌన్ కాలేజీ"లని పిలిచేవారు ప్రజలు. తెలుగు సాహిత్యంపై పండితులతో చర్చలూ గ్రంథ పరిష్కారాలూ ఒక వేపు జరుపుతూ, ఒక పక్క తెలుగు స్కూలూ మరో పక్క గ్రంథాలయంతో విశ్వవిద్యాలయాన్ని తలపింపజేసేది బ్రౌన్ యిల్లు.

బ్రౌన్ 36 పురాణేతిహాసాలను సేకరించి పరిష్కరించారు. మహాభారత శుద్ధ ప్రతిని తయారుచేశారు. ప్రబంధాలలో ఎన్నదగిన వసుచరిత్ర, మనుచరిత్రలను వ్యాఖ్యాన సహితంగా 1851 లోనే అచ్చు వేయించారు. పాతికేళ్ళలో సుమారు పాతిక ప్రబంధాలను పరిష్కరింప జేశారు. ప్రజా సామాన్యానికి సాహిత్యం అందుబాటులో ఉండాలనే ఉద్దేశంతో సులభశైలిలో పురాణాలను ముందు పరిష్కరింపజేసి ముద్రించి, ఆ తర్వాతనే పండితాదరణీయాలైన ప్రబంధాలను తీసుకొన్నారు బ్రౌన్.

బ్రాహ్మణేతరుల రచనలనే అభిప్రాయంతో పండితుల చేత తిరస్కరింపబడిన పదమూడు ద్విపద కావ్యాలను పరిష్కరింపజేసి, మరో యిరవై అయిదింటికి కాగితపు ప్రతులు రాయించి ద్విపద కావ్యాలకు గౌరవ ప్రదమైన స్థానాన్ని కల్పించారు బ్రౌన్. ఎనభై నాలుగు శతకాలను సేకరించి పరిష్కరించి సామాన్య ప్రజలకు చేరువ చేయదలచారు.

తెలుగు వ్యావహారిక భాషా వికాసానికి కృషి చేసిన మొదటివారు బ్రౌన్. తెలుగు నేర్చుకొనే విదేశీయులకు బ్రౌన్ స్వయంగా వ్యాకరణం రచించి 1840 లో ప్రచురించారు.

తెలుగు సాహిత్యంలో లేఖా సాహిత్యానికి ఒక స్థానాన్నిచ్చిన వ్యక్తి బ్రౌన్. బ్రౌన్ సేకరించి రాయించిన తెలుగు ఉత్తరాలు 20 సంపుటాలు. ఒక్కొక్క సంపుటి 400 పేజీలు. ఇవి భాషా చరిత్ర రచయితలకు ఎంతో సహాయపడతాయి.

తెలుగు వ్యావహారిక భాషను నిఘంటువులోనికెక్కించిన ఘనత బ్రౌన్‌కే దక్కుతుంది. ఏడేళ్ళ అవిరళ కృషి సల్పి 1416 పేజీల తెలుగు-ఇంగ్లీషు నిఘంటువును 1852లో ప్రచురించారు. ఈ నిఘంటువు అనువాదకులకు అద్వితీయంగా ఉపయోగపడుతుంది. ఇంగ్లీషు-తెలుగు నిఘంటువు 1853లో పూర్తి చేశారు. ఆంగ్ల సాహిత్యం తెలుగువారికి అందుబాటులోనికి తెచ్చే ముఖ్యోద్దేశంతో తెలుగు జీవ

భాషను ఈ నిఘంటువులో ఉపయోగించారు బ్రౌన్. జిల్లా నిఘంటువు, లిటిల్ లెక్సికన్ నిఘంటువులు గూడా బ్రౌన్ ప్రకటించారు. బ్రౌన్ తర్వాత ఎందరు ఎన్ని నిఘంటువులను రాసినా బ్రౌను నిఘంటువులను ఉపయోగించకుండా రాయలేదని చెప్పవచ్చును.

ఆంధ్ర సంస్కృత భాషల ఛందస్సుపైన, భారతీయ శిల్పశాస్త్రంపైనా ఆచార వ్యవహారాల పైన, తాంత్రిక సాహిత్యంపైన, నక్షత్ర మండలాలపైన, భాషా స్వరూపాలపైన, రాజుల యుద్ధాలపైన, బాల సాహిత్యం పైన-ఒకటేమిటి ? బ్రౌన్ అనేక విషయాలపై చిన్న చిన్న రచనలు చేశారు. బైబిల్ ఆంధ్రానువాదంలో కూడా బ్రౌన్‌కు సంబంధం వుంది.

బ్రౌన్ పర్యవేక్షణలో 600 పేజీల పంచాంగం 1850లో ప్రకటించబడింది. హిందూ విజ్ఞాన సర్వస్వమన దగినక ర్నాటిక్ క్రొనాలజి బ్రౌన్‌బహుముఖ పరిశోధనా అధ్యయనాన్ని తెలుపుతుంది. వ్యావహారిక భాషలో బ్రౌన్ రచించిన తెలుగు వాచకం పాశ్చాత్య తెలుగు విద్యార్థులకు, సివిల్ సర్వీసు పరీక్షకోసం తెలుగు నేర్చుకొనే వారికి చాలా ఉపయోగపడుతుంది. ఇవి కాక, ప్రభుత్వం కోసం, విద్యాలయాల కోసం వేలాది పేజీలను ఇంగ్లీషు-తెలుగు అనువాదాలు చేశారు. తన మాతృభాషైన ఇంగ్లీషులో ఎన్నో కవితలు, వ్యాసాలు రాశారు బ్రౌన్.

బ్రౌన్‌ఉద్యోగరీత్యా కడప, మచిలీపట్నం, రాజమండ్రి, కంబం, గుంటూరు, మద్రాసు నగరాలలో పని చేశారు. 24 భాషలలో పాండిత్యం గలవారు బ్రౌన్. పెళ్ళి, పెళ్ళాం, పిల్లలు వంటి బాదర బందాలేమీ లేకుండా తెలుగు భాషా సాహిత్యాలే తన శ్వాసగా బతికారు బ్రౌన్.

కంపెనీ ఉద్యోగిగా, న్యాయాధికారిగా ప్రజల సమస్యలకు స్పందించి, సహాయన్నందించారు. 1831-33లో గుంటూరులో దుర్భరమైన కరువు పరిస్థితులపై ప్రభుత్వానికి నివేదిక పంపి తక్షణ ఆర్థిక సహాయాన్ని కోరి ప్రభుత్వ ఆగ్రహానికి గురయ్యారు బ్రౌన్. తెల్లదొరల పాలనలోని లోపాలను ఎత్తిచూపిన దొరల ప్రతినిధి బ్రౌన్ బహుసాహసి. విదేశీయుడైనా తెలుగు బిడ్డగా గుర్తింపు పొందిన సాహిత్య పిపాసి బ్రౌన్ జీవితం అందరికీ ఆదర్శప్రాయమైనది.

బ్రౌన్ పుట్టుకా చావూ ఇంగ్లాండుది; అతని బతుకు మాత్రం తెలుగుదేశానిది. చిరస్మరణీయుడైన సి.పి. బ్రౌన్‌కు జోహారులు.

(జానమద్ది హనుమచ్ఛాస్త్రిగారికి కృతజ్ఞలతో)

---

## రామ్ కా నామ్

కర సేవో
నరచావో
తేల్చ మంటున్నది మతం
మసీదో
మనిషి ఎవో
కూల్చ మంటున్నది మతం
మతం పిచ్చిదై
నరం మీద పుండు లాగ
మతం గుడ్డిదై
పీక మీద కత్తి లాగ
మంచిని శంకిస్తూ
మనిషిని ప్రశ్నిస్తుంది
మనిషిని యుడిపిస్తూ
మతం నడిపిస్తుంటే —
పి. వి. గుడ్లగూబ చూపులు
పొంచి వున్న ప్రమాదాన్ని చూడలేదా ?
'విద్దూరం గుద్దెడితే'
కళ్యాణ్ సింగ్ మంత్రసాని కాగలడా ! ?
కేంద్ర, రాష్ట్రాల తగువు లాటలో
ఓట్ల కోసం జరుగు కుమ్ములాటలో -
రాం పోతులో
రహీం జాతులో
పోతులో, జాతులో
తేడా లేదిక్కడ
మంటల్లో మూల్గుతూ
మతాన్ని ప్రశ్నిస్తున్నాయి
కాలి కాలి బూడి దవుతూ
కులాన్ని అడుగుతున్నాయి —
బువ్వ కోసం కాదని ?
భూమి కోసం కాదని ?
మానవత్వాన్ని మంట గలుపుతున్న
మతాన్ని ప్రశ్నిస్తున్నా —
కాషాయి రంగు గుడ్డలోని
కసాయితనాన్ని అడుగుతున్నా —
భుక్తికోసం పోరులో
భూమి చౌరికే దారిలో
మతం లేదని
కులం లేదని

— నిశితాసి

( 52 వ పేజీ తరువాయి )

ఇంక దీనికి బహువచనాన్ని ఏం తీసుకోమమ్మా మేం ?
ఎక్కడో మనసు అట్టడుగు పొరల్లో
సమాధి చేద్దామను కున్నబాధని
తిరగ తోడింది నీ కవిత.
లాభం లేదు - తిరిగి నే మనిషినవ్వాలంటే
ఒక్కటే చికిత్స ! / డిస్టర్బ్ చేయకు
మా 'పంచాది నిర్మల'ని తలుచుకుంటున్నాను.
నేనిప్పుడు చెప్పాల్సింది చాలానే వుంది.

—పి.ఎస్. రమ

(కొండేపూడి నిర్మల కవిత 'హృదయానికి బహువచనం' చదివిన తర్వాత)

వీడిచిపుచ్చేశాడు. 1950 నుండి నేటికివరకుసుమారు 90 సార్లురాజ్యాంగంలోని 356వ అధికరణాన్ని వినియోగించుకున్న కేంద్ర ప్రభుత్వం ఇప్పుడేదో "స్వయం నిర్ణయాధికారాలకు" విలువ నిచ్చినట్టు పోజు పెట్టింది.

### బాబ్రీ మసీదుని కూలనివ్వటం ద్వారా ...

1. బి. జె. పి. యొక్క వికృత మారహంకార స్వభావానికి సాధారణ హిందువులు, సమస్త మైనారిటీ వర్గాలు భయపడేట్టు చేసి.... వారికి కాంగ్రెసు తప్ప మరో దిక్కులేని వాతావరణాన్ని కల్పించటం.
2. షేర్ల కుంభకోణం, మండల్ కమీషన్, విదేశాలకు దేశాన్ని తాకట్టు పెట్టే విధానాలూ, అధిక ధరలూ, నిరుద్యోగం, సారా వ్యతిరేక పోరాటాలు .... మొదలైన ముఖ్య దేశస్థాయిసమస్యలన్నిటినీ ప్రజలుమర్చిపోయి "మందిరం-మసీదు" గురించే చర్చించుకొనేట్టు చేయటం.

నయ వంచనా శిల్పంతో ఆరితేరిన కాంగ్రెసుకు సెక్యులర్ విలువల కోసం నిలబడే స్వభావం లేదు. రాజీనామా చేయటం కాంగ్రెసు ప్రభుత్వ కనీస నైతిక బాధ్యత.

### V

1949 లో దౌర్జన్యంగా బాబ్రీ మసీదులో సీతారాముల విగ్రహాలు నిలబెట్టి వివాదాన్ని సృష్టిస్తే ఈ నాటికీ కోర్టులు దాన్ని పరిష్కరించలేదు. విశ్వాసాలతో తప్ప మరే చర్చకూ చారిత్రక ఆధారాలనూ పరిగణించమని ఖరాఖండిగా, మొండిగా వాదిస్తున్న మతోన్మాదులను, "రాజ్యం" ఎలా నిరోధించ దలుచుకుంది ? రాముడే విశ్వాసానికి సంబంధించిన వ్యక్తయితే ఆయన పుట్టిన పురిటి గదిని ఎలా శోధించి నిర్ధారించగలరు ? భగవ తుడున్నాడో లేడో కోర్టులు తీర్పు చెప్పగలవా ?

కనుక లౌకిక, హేతువాద దృక్పథంతో తప్ప వాటికి సమాధానం చెప్పగలిగేదే లేదు.

బతుకున్న "దేవుడు", పుట్టపర్తి బాబాకు సాష్టాంగ దండ ప్రణామాలు చేసే వారూ, తిరుపతి వెంకన్నకు పొర్లు దండాలు పెట్టుకునే వారూ అత్యున్నత రాజ్యాంగ, రాజకీయ పదవులలో వుంటే.... సెక్యులర్, ప్రజాస్వామ్య విలువలను "రాజ్యం" (State) కాపాడగలుగుతుందా ?

పని గట్టుకుని బాబ్రీ మసీదుని ఒకరు వివాదం చేస్తే మరొకరు నానబెట్టి నాన బెట్టి కోర్టులచుట్టూ తిప్పి ఎటూ తేల్చకుండా చివరికి "గజంమిధ్య పలాయనం మిధ్య" లాగా మార్చబోతున్నారు.

అద్వానీ రథయాత్రా కాలంలోనూ, కర సేవా సమయాలలోనూ, మొన్నటి మసీదు విధ్వంసంలోనూ సాయుధ దళాలు నిర్వహించిన పాత్ర అపనమ్మకంగా

తయారయింది. వారిలో కూడా మతతత్వ భావాలు పని చేస్తున్నాయి. మతతత్వ రాజ్యంగా మారుతున్నదాని కిదొక సూచిక.

మసీదు కూల్చివేత తర్వాత చనిపోయిన వారిలో అత్యధికులు మతకలహాల వల్ల కాదని తేలిపోయింది. సాయుధదళాల నిర్దాక్షిణ్యమైన కాల్చివేతవల్ల, అయోధ్యలో చూపించలేని కఠుకుదనం దేశమంతా ప్రదర్శించారు. ప్రతి చిన్న సందర్భాన్నీ ప్రజల్ని భీతావహులు చెయ్యటానికే పాలకులు వినియోగించుకుంటున్నారు.

ఆంధ్రప్రదేశ్‌లో ప్రశాంతత చేకూరిందని ప్రకటించినతర్వాత ఊరేగింపులూ, సభలపై నిషేధాల్ని ప్రకటించారు. శాంతి యాత్రలకు కూడా కొన్నిచోట్ల అనుమతి నీయలేదు. ప్రజల కదలికల్ని అదుపు చెయ్యటానికి దీన్ని కూడా ఒక సాకుగా తీసుకొని సారా సామ్రాట్టులకి ఆనందోత్సాహాలు కలిగిస్తున్నారు.

## VI

అంతర్జాతీయంగా సోషలిస్టు, ప్రజాస్వామ్య శక్తుల తాత్కాలిక ఓటమి బూర్జువా, భూస్వామ్య, సామ్రాజ్యవాద, పెత్తందారీశక్తులకు కొత్త ఊపిర్లు పోసింది. ఉన్మాద, అహంకారపు రెక్కలు విప్పుకొనే అవకాశాన్నిచ్చింది. మన దేశంలోని నిజమైన సెక్యులర్, నూతన ప్రజాస్వామ్య శక్తులు తగినంత సంఘటితంగా లేవు. అవకాశవాదులు పాలకవర్గాలు "సాగినప్పుడల్లా తిట్టడం - ఆగినప్పుడల్లా నెట్టటం" సాగిస్తూనే వున్నారు.

తరాతరాల భారత చరిత్రలో సామాజిక పీడనకి వ్యతిరేకంగా నిలిచినసమస్త భావజాలాన్నీ, ఉద్యమాలనూ స్వంతం చేసుకుని అగ్రవర్ణ కుల దురంహంకారానికి మరో రూపమైన బ్రాహ్మణ సంస్కృతికి వ్యతిరేకంగా అన్ని రంగాలలోనూ పోరాడదాం. మతోన్మాదం మనుషుల మానవత్వాన్నీ, సహృదయాన్నీ విరిచేసి విషం నింపుతుందన్న సత్యాన్ని చాటుదాం.

"స్వతంత్ర" భారతపు "ప్రగతి" ఫలాలు అత్యంత హేయమైన రూపాల్లో కొద్ది మంది జేబుల్లోకి జేరి సర్వ వ్యాపిత సంక్షోభంలో కూరుకుపోయిన సామాజిక పరిస్థితుల్లో దాన్ని ప్రతిఘటించే శక్తివంతమైన ప్రజా ఉద్యమం కొరవడిన వాతావరణంలో ఫాసిస్టు మతరాజ్య భావన వ్యాప్తిగాంచుతోంది. భారత పాలకులు ప్రజల వాంఛల్ని, పోరాటాల్నీ అనుమతించటం సాధ్యంకాని చరమదశకు చేరుకున్న స్థితిలో వారికి మిగిలిన చివరి ఆయుధం మిలటరీ నియంతృత్వం లేక ఫాసిస్టు మత రాజ్యం. దోపిడీ వ్యవస్థ పీడనల కింద నలిగిపోతున్న ప్రజానీకం సుసంఘటితంగా నిరంకుశత్వాన్ని, మతతత్వ రాజకీయాల్ని ఓడించటమొక్కటే దీనికి నిజమైన పరిష్కారం.

మైనారిటీలు- ముఖ్యంగా ముస్లింలు, క్రిష్టియన్లు, సిక్కులు— హిందూ మతోన్మాదానికి విరుగుడు మైనారిటీలు మతోన్మాదం కాదని గ్రహించాలి. మతదురహం

(తరువాయి 62 వ

# స్వీకారం

1. కల్లోల కలల మేఘం (కవితా సంకలనం)-నారాయణస్వామి, విరసం సిటీ యూనిట్, పేజీలు : 96, వెల రు. 15-00.

2. పూలే, అంబేద్కర్‌లగురించి ఇంకోసారి-వెంకన్న, సంజీవ్, రామలింగం, సుధా కిరణ్ - విజృంభణ ప్రచురణ, పేజీలు 36, వెల: రు. 3-00

రెండు పుస్తకాల ప్రతులకు : నవోదయ హౌస్, ఆర్య సమాజ్ మందిర్ ఎదురుగా, సుల్తాన్ బజార్, హైదరాబాదు.

3. సారా రాజ్యం కాదు - ప్రజా రాజ్యం కావాలి, వి. చెంచయ్య వ్యాసం + 'సారా' జహాసే అచ్ఛా — బజరా గల్పిక - విరసం నెల్లూరు జిల్లా యూనిట్ ప్రచురణ, 22 పేజీలు. వెల రు. 2-00, ప్రతులకు : రచయిత, 6-5-13-, కావలి - 524 201.

4. అంబేద్కర్ మత విధానం - యం. వి. రమణ - ప్రచురణ : భీమ్‌భేరి ప్రచురణలు — పేజీలు : 56, వెల రు. 10-00, ప్రతులకు : జి. నవీన్, పంచ శీల నిలయం, క్వార్టరు నెం : F-229, బి.హెచ్.పి.వి. టౌన్‌షిప్, విశాఖపట్నం - 520 012.

5. మహావృక్షం (ఆధునిక ప్రబంధ నవల) - పి. చంద్రశేఖర్ అజాద్, పేజీలు : 208, వెల రు. 20-00, మన బుక్స్ ఇంటర్‌నేషనల్, పోస్టు బాక్స్ నెం. 24, న్యూఢిల్లీ-110 001.

6. సావిత్రి (రాజమండ్రి సావిత్రిగారి రచనలూ, ఆమెపై మిత్రులు రాసిన స్మృతులు) సంపాదకుడు: అరణ్య కృష్ణ, పేజీలు 142, వెల రు. 15-00, ప్రచురణ: మిత్రులు, ప్రతులకు: మైత్రి బుక్ హౌస్, విజయవాడ.

7. దృశ్య కావ్యం (గులాం రసూల్ కోసం) - డా॥ చెరుకు సుధాకర్, వెల రు. 5/-, ప్రచురణ : కవి డాక్టర్ కోట్నీస్ ఆరోగ్య సేవా సంస్థ, నకిరేకల్-508 211 (నల్గొండ జిల్లా)

8. భారతరత్న మోక్ష గుండం విశ్వేశ్వరయ్య (జీవితం) - జానమద్ది హనుమచ్ఛాస్త్రి - పేజీలు : 68, వెల: రు. 15-00, ప్రతులకు : రచయిత, మహతి, 1/1843, గాంధినగర్, కడప-516 004.

9. సి.పి. బ్రౌన్ జీవితం (జనప్రియ గ్రంథమాల) - రచయిత ; జానమద్ది హనుమచ్ఛాస్త్రి, పేజీలు 160, వెల ; రు. 10-00, ప్రచురణ : తెలుగు అకాడమి, హైదరాబాదు.

10. అలావ్ (హిందీ కవితా సంచిక),98 కవుల కవితలతో, సంపాదకుడు : రామ్ కుమార్ కృషక్, విజయ్ అంకుశ్, ఉమాశంకర్ పథిక్, పేజీలు : 176, వెల రు. 20-00, ప్రతులకు : C-3/59, సాదత్‌పూర్ విస్తార్, కరావల్‌నగర్, ఢిల్లీ - 110 094.

11. ఆముఖ్ (హిందీ పత్రిక, ఏప్రిల్ 92 సంచిక) సంపాదకుడు : కంచన్ కుమార్, శుకదేవ్ ఛటోపాధ్యాయ, శ్రవణ్‌కుమార్, పేజీలు: 72, వెల రు. 5-00 ప్రతులకు : సంపాదకులు, చిత్త రంజన్ పార్క్, న్యూఢిల్లీ - 110 049

12. నక్సల్ బాడీ ఔర్ సాహిత్య—హిందీ వ్యాస సంకలనం (బెంగాలీ విప్లవ సాహిత్యంతో పాటుగా సుబ్బారావు ప్రాణిగ్రాహి, విరసం, శ్రీశ్రీ, చెరబండ రాజు, వరవరరావు, గద్దార్, పాష్ పరిచయాలూ రచనల అనువాదాలూ కూడా వ్వబడ్డాయి.) ప్రచురణ ; ప్రోగ్రెసివ్ పబ్లికేషన్స్, పేజీలు 112, వెల: రు. 10-00.

13. హమ్ తో భూలే నహీ షహీద్ (మేం మర్చిపోలేదు అమరవీరులారా!) పెన్నూ గన్నూ పట్టి అమరులైన బెంగాలీ విప్లవ కవుల పరిచయం - సాహిత్యం హిందీలో - పేజీలు: 52, వెల రు. 5-00, బెంగాలీనుండి అనువాదం: సంపాదకత్వం, కంచన్ కుమార్ : ప్రచురణ : ప్రోగ్రెసివ్ పబ్లికేషన్స్ : 12, 13 ప్రతులకు : నవీన్, 247, కావేరీ హౌస్, జె.యన్.యు, న్యూఢిల్లీ—110 069.

14. 'అరుణ తార', గురజాడ సంచిక.... వెల రు. 5-00, సంపాదకులు : కె.వి.ఆర్, విరసం ప్రచురణ.

15. అగ్ని శిల్పి (వచన గేయాలు) — వుయ్యూరు రామకృష్ణ పేజీలు 68, వెల రు. 5-00, ప్రచురణ ; వినోదిని పబ్లికేషన్స్, రాజాపేట, తిరువూరు - 521 325.

16. సారా కథలు (సాహిత్య నేపథ్యం) సృజన ప్రచురణలు, హైదరాబాద్, పేజీలు 100, వెల రు. 7—00

17. కాగడాగా వెలిగిన క్షణం — (కొన్ని కవితలు — మరికొన్ని ఇతర రచనలు), ఎం.ఎస్.ఆర్. — విరసం జంట నగరాల ప్రచురణ, పేజీలు 152. వెల రు : 20-00, ప్రతులకు; నవోదయ బుక్ హౌస్, కాచిగూడ, హైదరాబాద్

# మార్క్సిస్ట్ తత్వశాస్త్ర అనువాద కృషిలో పర్‌స్పెక్టివ్స్

ఇంతవరకూ తత్వవేత్తలు ప్రపంచాన్ని రకరకాలుగా వ్యాఖ్యానించారు. అసలు విషయం ప్రపంచాన్ని మార్చడం అనంటుంది మార్క్సిజం. ప్రపంచాన్ని వాఖ్యానించాలన్నా, మార్చాలన్నా ముందు దాని ఆనుపానులు తెలుసుకోవాలి. ఇందుకు తత్వశాస్త్ర అధ్యయనం ఎంతో దోహదం చేస్తుంది. అటువంటి యీ తత్వ శాస్త్రానికి వున్న విశిష్టత ఎలాంటిది? దానికి అటు మతంతోనూ యిటు సైన్సుతోనూ వున్న సంబంధం ఎలాంటిది? జీవితానికి తత్వ శాస్త్రానికి వున్న లంకె ఏమిటి? ఇంకా అనేకానేక సమస్యలకి సమాధానం మార్క్సిస్టు తత్వశాస్త్రం. దీన్ని వీలైనంత సరళంగా తెలుగులోకి తేవాలని ప్రయత్నిస్తున్నాం. ఈ సిరీస్ మొత్తానికి చలసాని ప్రసాద్ ఎడిటర్‌గా వుంటారు. తత్వశాస్త్ర గ్రంథాలని సరిగా అనువాదం చేయగల వారు, తత్వశాస్త్రంపట్ల అవగాహన కలవారు తమ అనువాద సహకారాన్ని, సూచనలని చలసాని ప్రసాద్ గారికి అందించండి.

ఆయన చిరునామా :

**చలసాని ప్రసాద్,** ఎడిటర్, పర్‌స్పెక్టివ్స్ ఫిలాసఫీ సిరీస్,
**15—LIG, H.B.** కాలనీ విశాఖపట్నం-530002

ఈ తత్వశాస్త్రం సిరీస్‌లో మొదటి ప్రచురణగా హోవార్డు సెల్‌సామ్ రాసిన "తత్వశాస్త్రం అంటే ఏమిటి?"ని ప్రచురిస్తున్నాం. అనువాదం - చలసాని ప్రసాద్. ప్రస్తుతం అనువాదం జరుగుతున్న రచనలు-

→**Human Essence -George Thomson-**
అను- త్రిపురనేని మధుసూదనరావు

→**Economic and Philosopical Manuscripts-**
**Marx** - అను-ఎన్. వేణుగోపాల్

★**An Introduction to Marxist Philosophy -**
**David Guest** - అను - అరుణ్

---

తత్వశాస్త్రం పట్ల అభిమానం, ఆసక్తి వున్నవారందరూ తమ వంతు చేయగల ఆర్థిక, హార్దిక సహకారాలని చలసాని ప్రసాద్‌గారికి అందించండి. విరాళాలు పంపేటప్పుడు "ఫిలాసఫీ సిరీస్ కోసం" అని స్పష్టంగా పేర్కొనండి.

మీ సహకారంతో మాత్రమే యీ సిరీస్‌ను పూర్తి చేయగలం.

—జి. హరగోపాల్, పర్‌స్పెక్టివ్స్

(58 వ పేజీ తరువాయి)

చాటున అది దోపిడీ శక్తులను అగ్రవర్ణ సంస్కృతికి రాచబాటను నిర్మించాలని కలలుగంటోంది. దాని అణచివేతకు గురవుతున్న సమస్త పీడిత ప్రజానీకంతోనూ, హిందూ కులాలూ, దళితులూ, మహిళలతోనూ కలగలిసి సుసంఘటితంగా పోరాడటం తప్ప మరొక దారిలేదు. అశాంతి - అభద్రత కలిగించే శక్తులకు వ్యతిరేకంగా పోరాడకుండా శాంతి—భద్రతలు నెలకొనవు. నిజమైన లౌకిక వాదాన్నీ, నూతన ప్రజాస్వామ్య భావజాలాన్నీ స్వీకరించటం ద్వారానే మతోన్మాదాన్ని ఎదుర్కొన గలుగుతాము.

* కూల్చిన బాబ్రీ మసీదు స్థానంలో ప్రభుత్వం మసీదు నిర్మించి యివ్వాలి.
* పాఠ్య గ్రంథాలలోనూ, రేడియో, టీ.వి. కార్యక్రమాల్లోనూ మతతత్వాన్ని రెచ్చగొట్టే అంశాలను తొలగించాలి.
* మతాన్ని రాజ్యానికి (State) దూరంగా వుంచాలి.
* పోలీసు కాల్పుల సంఘటనలన్నిటిపై న్యాయ విచారణ జరిపించాలి.
* వెయ్యి మందిరాల కన్నా పది నూర్ల మసీదుల కన్నా ఒక మానవ ప్రాణం మిన్న!

---

## జనసాహితి ప్రచురణలు

| | | |
|---|---|---|
| 1. | పరిణామవాదం - ప్రథమ పాఠాలు — ఆర్. కె. | రు. 4-00 |
| 2. | శ్రీకాకుళం కావ్యం (ఉద్యమ కావ్యం) — ఛాయరాజ్ | రు. 12-00 |
| 3. | కొ. కు. బుద్ధి కౌలత వాదం - ఒక పరిశీలన — డా॥ బి. సూర్య నారాయణ రెడ్డి | రు. 5-00 |
| 4. | నా నెత్తురు వృథా కాదు (భగత్‌సింగ్ రచనలు) సాధారణ ప్రతి | రు. 25-00 |
| | సంపాదకుడు : నిర్మలానంద, మేలుప్రతి | రు. 50-00 |
| 5. | పాష్ కవిత — సంపాదకుడు : నిర్మలానంద | రు. 6-00 |
| 6. | అడుగుజాడల్లో .... (కన్యాశుల్కంపై వ్యాస సంపుటి) .... | రు. 8-00 |
| 7. | సారా వ్యతిరేక పోరాట పాటలు | రు. 2-00 |

ప్రతులకు :
మైత్రీ బుక్ హౌస్
మసీదు సందు, విజయవాడ

# చైతన్య వాహిని

## జన సాహితి ప్రచురణ 'అడుగుజాడల్లో' ఆవిష్కరణ

**రేపల్లెలో :**

నవంబరు 30 గురజాడ వర్ధంతి సందర్భంగా రేపల్లె బాల విద్యా నికేతన్, సమతా జూనియర్ కళాశాల, గుడ్డికాయలంక కోటేశ్వర అప్పర్ ప్రైమరీ పాఠశాలల ఆధ్వర్యాన 500 మంది బాల బాలికలచే సాహితీ ఊరేగింపు జరిగింది. ఈ ఊరేగింపులో ప్రత్యేకంగా గురజాడ జీవితం, గేయాలతో రూపొందించిన ఆడియో క్యాసెట్ విన్పించడం జరిగింది. ఆ తర్వాత బాల విద్యా నికేతన్‌లో నగరం కళాశాల ప్రిన్సిపల్ నందేగడ్డ కోటేశ్వరరావుగారి అధ్యక్షతన జరిగిన సభలో జనసాహితి ప్రచురించిన "అడుగు జాడల్లో" గ్రంథాన్ని రేపల్లె ప్రభుత్వడిగ్రీకళాశాల, ఆంధ్రోపన్యాసకులు మొవ్వ కృష్ణాద్రిపతిగారు ఆవిష్కరించారు. ఆ సభలో జన సాహితి ప్రధాన కార్యదర్శి కొత్తపల్లి రవిబాబు మాట్లాడుతూ గురజాడ, వీరేశలింగంపై కొందరు చేస్తున్న దాడిని విమర్శించారు. వ్యావహారిక భాషను ఏ విధంగా ఉపయోగించుకోవాలో, మూఢవిశ్వాసాలను ఎలా అభివృద్ధి చేయాలో గురజాడ నూరేళ్ళ క్రితమే ఒక మార్గం చూపించారన్నారు.

**తెనాలిలో :**

నవంబరు 30న తెనాలి పట్టణ "ప్రజా నాట్య మండలి" శాఖ ఆధ్వర్యాన నూరు సంవత్సరాల "కన్యా శుల్కం" పై గోష్టి, సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించారు. ఆ సందర్భంగా "పుత్తడి బొమ్మ పూర్ణమ్మ" నృత్య ప్రదర్శన అనంతరం జన సాహితి ప్రచురణ "అడుగు జాడల్లో" ఆవిష్కరణ జరిగింది. "అంకురం" సినిమా దర్శకుడు శ్రీ ఉమామహేశ్వరరావు పుస్తకాన్ని ఆవిష్కరించటానికి ముందు అరుణోదయ రాష్ట్ర అధ్యక్షుడు దివికుమార్, గురజాడ ప్రత్యేకతనీ మహిళా విముక్తి పోరాటంలో భాగంగా నేటి ఉద్యమాలనూ ప్రస్తావిస్తూ పితృస్వామిక వ్యవస్థను అంతం చేయవలసిన కర్తవ్యాన్ని సభ దృష్టికి తీసుకువచ్చారు. డిసెంబరు 14వ తేదీన గుంటూరు జిల్లా నగరం కళాశాలలో "అయోధ్య పరిణామాలు" అన్న అంశంపై అరుణోదయ అధ్యక్షుడు దివికుమార్ ప్రసంగించారు.

## అరుణోదయ, విజయవాడ దళం :

* అరుణోదయ విజయవాడ దళం రాష్ట్ర పర్యటనలో భాగంగా కరీంనగర్ వెళ్ళి, స్థానిక కళాకారులకు శిక్షణ నిచ్చి నవంబర్ 8న కరీంనగర్‌లో జరిగిన బహిరంగ సభలో "ఎత్తిన జెండా దించకోయ్" (నిశ్చలన దృశ్య రూపకం) ప్రదర్శించి విప్లవకారుల ఐక్యత కోరుతూ సాంస్కృతిక ప్రదర్శన ఇచ్చారు.
* 9న జరిగిన సారా వ్యతిరేక సదస్సులో పాల్గొని జనం పాటలు పాడి, "శబ్దం" వీధి నాటిక 26న ప్రదర్శన ఇచ్చారు.
* నవంబర్ 25న కృష్ణాజిల్లా కొడవడిగల్లులో జరిగిన సారా వ్యతిరేక బహిరంగ సభలో "అప్పుల భారతం", "శబ్దం" ప్రదర్శించారు.
* విజయవాడలో వివిధ విప్లవ ప్రజా సంఘాలతో కూడిన సారా వ్యతిరేక ఉద్యమ కమిటీలో అరుణోదయ విజయవాడ దళం భాగస్వామి అయి వివిధ పేటలలో ప్రచార కార్యక్రమంలో పాల్గొంది. నవంబర్ 28న సున్నపుబట్టీ సెంటర్‌లోను, డిసెంబర్ 2న రామవరప్పాడులోనూ, 3న నిడమానూరులోను "శబ్దం" వీధి నాటకాన్ని ప్రదర్శించింది.
* నవంబర్ 4న గుంటూరు జిల్లా 14వ మైలు" వద్ద పరిసర గ్రామాల సర్పంచుల సారా వ్యతిరేక బహిరంగ సభలో పాల్గొని పాటలు పాడి "శబ్దం" ప్రదర్శన ఇచ్చింది దళం.

Edited, Printed and Published by K. RAVI BABU on behalf of JANA SAHITI (A.P.). at Chaitanya Printers, Vijayawada-2. for Co-operative Press, Vijayawada.
Working Editorr : NIRMALANANDA

# పెకిలించండి మతోన్మాదుల పునాదులను

మీరు గట్టిగా ఖండించండి, కామ్రేడ్స్!
మతోన్మాదాన్ని గట్టిగా ఖండించండి!
మతోన్మాదం గొడవ మళ్ళీ మొదలయింది కామ్రేడ్స్
మళ్ళీ మొదలయింది.
క్షణం క్షణం గుబాళించ బయటున్న మనసామూహిక చైతన్యాన్ని
కులాలుగా, ఉప కులాలుగా చీల్చి
అధికార సామ్రాజ్యకోసం
అమాయకుల ప్రాణాలను వెచ్చటి మడుగుల్లో కలుపుతూ
కొలాట మాడుతున్నారు
మసి బూసి మారేడు కాయ చేస్తున్నట్టు
కత్తులతో కసా బిసా పొడుస్తూ
మాయ చేస్తున్నారు మనుషులను
దేశమంతా 'కర్ఫ్యూ' మయం అల్లర్ల హత్యలు
కామ్రేడ్స్!
మతాన్ని నేర్పే భావజాలాయుధాన్ని బలవంతంగా
బయటకు లాగి
గతితార్కిక ప్రాపంచిక మార్గాన్ని
నేర్చుకోండి కామ్రేడ్స్!
కులంతో, మతంతో మనుషుల దోపిడీ చేసే
మతోన్మాదుల పునాదులను పెకలించి
ఈ ధాత్రి అంచుల నుండి దద్దరిల్లేలా
తరిమి కొట్టండి
హిందూ ముస్లిం భాయ్ భాయ్ అంటూ
మానవత్వపు ఎర్ర జెండాను మరింత
ఎరుపెక్కించి
సమున్నతంగా ఎగరేయండి కామ్రేడ్స్!
సమున్నతంగా ఎగరేయండి!!

—ఎం. నిరంజన్

# మా కోసం మీరు

వెలుగులు కలసి నవ్వే వేళలో
అన్నలతో ఆనందాన్ని పంచుకోవాలన్న మాకు
విషాదం మిగిలింది

రక్త సిక్తమై తూటాలతో తొలుచుకు పోయిన దేహాలు
స్వేచ్ఛా, అహింసల ప్రభుత్వ చిహ్నాలుగా కనిపిస్తున్నాయి
చైతన్య పూరిత నినాదాలను తుడిపి వేసేందుకు
బలవంతపు బ్రాహ్మణార్థంగా
వెల్లవేయబడ్డ గోడలు
నేడు

బుల్లెట్లను నింపుకొని తీగాలుగా
విలపిస్తున్నాయి
ఉక్కు డేగల పహారాలో
పల్లె తల్లులు విషాదాశ్రువులను కురిపిస్తున్నాయి
చీకటి నిండిన మా బతుకుల్లోకి
వెలుతురును రానిచ్చిన నేరానికి

వధ్యశిలల పైకి మమ్మల్ని నడిపిస్తున్నపుడు
వెలుగును చూపించిన మాకంటి పాపలు
మాలోని అంతర్ ప్రాణమై
అహరహమూ జీవిస్తారు
ఎదుగుతున్న పోరులో, జనగానాల్లో
ఎర్రజెండా రెపరెపల్లో
అనంతకోటి జన జీవన ఉచ్ఛ్వాస నిశ్వాసాల్లో
మిమ్మల్ని చూస్తాము
మా కోసం మీరు విడిచిన ఊపిరిని
మేం పీల్చుకుంటాం

—అర్జి

(కరీంనగర్ జిల్లా బద్దెపల్లి గ్రామంలో పోలీసు, టి.ఎస్.ఎఫ్ కర్కశ మూకలు సాగిస్తున్న రాజ్యంలో నేలకొరిగిన కామ్రేడ్ సర్దారన్న తదితర ఐదుగురి అమరుల స్మృత్యర్థం....)